# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

ఆగస్టు–అక్టోబరు 1968 8 త్రైమాసిక



నిర్వహణ: సాహితీమి[illegible]లు 80 పేజీలు వెల: ఒక రూపాయి.

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

( త్రైమాసిక )

8

ఆగస్టు–అక్టోబరు 1968

నిర్వహణ

'సాహితీమిత్రులు'

# జరుక్ సూత్ర నాధశాస్త్రి చనిపోయెను చనిపోయెను

అభ్యుదయ (శ్రీశ్రీ) కవితా ప్రస్థానపు 'పద్యాల వేగంతో ప్రపంచపు పాత దుమారమంతా పూడ్చుకపోయి. హృదయాల మీద పెంకులు పగిలి పోతూవుంటే' వినడానికి, వినిపించడానికి భేషజాలులేని నిండుహృదయంతో 'రోడ్డుమీదికి' వచ్చి నిలచినవాడు

'జల రుక్మిణీ సూత్ర నాధ
శాస్త్రి పాడు శ్రీరాగమ్'
అని శ్రీశ్రీ చేత ప్రాసక్రీడలు చెప్పించుకున్నవాడు
'ఏ రోడ్డు చరిత్ర చూసినా
ఏమున్నది గర్వకారణం'

అని తెలుగులో పారడీ ప్రక్రియకు ప్రారంభం చేసినవాడు, సహృదయుడు, సరసుడు 'పాత కొత్తల మేలికలయిక' జలసూత్రం రుక్మిణీ నాధ శాస్త్రిగారి మరణానికి విచారిస్తూ వారికుటుంబానికి మా ప్రగాఢ సానుతాపాన్ని వ్యక్తం చేస్తున్నాము.

—సాహితీమిత్రులు.

---

printed, published and edited by vararavarao for 'sahithee mithrulu' at parvati printing press, Jadcherla.

# పల్లవిస్తూన్న వసంతం

— ప్రకాష్ కుమార్

పరాధీనత కీ స్వాతంత్ర్యానికీ మధ్య
ఒక అగాధం శిశిర మహాయానం
స్వార్థం తెగబలిసిన పందుల గురగురలా
చలిగాలి విపరీతపు రొద.

బ్రతుకు మీద రోతపుట్టి ఏడుస్తున్నవాళ్ళ
ఎక్కిళ్ళలా జడులుజడులుగా మంచు.

ఈ చలికీ, అంతకన్న విపరీతపుకలికీ
భయపడి ఆశయాలమూటని మూపున
కట్టుకొని బయలు దేరాను వలసపోడానికి,

ఎన్నాళ్ళనించో సాగిస్తున్న
ఎన్నో దివారాత్రాలను గడచిన ఈ మహాయానం
అంతు తెలియటం లేదు - కోరింది కనీసం
దృశ్యమానమేనా కావటం లేదు
అయినా చిరిగిపోతున్న ధైర్యాన్ని కప్పుకొని
అరిగిపోతున్న చెప్పుల్ని — మానవశక్తుల్ని
జాలిగా చూస్తూ నడుస్తున్నాను.

గడచిన రోజులన్నిటికన్నా యీరోజు యీరాత్రి
అతిక్లిష్టంగా ఉంది - బాగా చీకటిగా ఉంది
ఎంత కప్పుకొన్నా చలికి ఆపుకోలేక పోతున్నాను
దారి కంటకావృతంగా ఉన్నా నడక
సాగిస్తూనే ఉన్నాను - కాని
ఎటు వెడుతున్నానో ఎక్కడికి
వెళ్ళాలో అటే వెడుతున్నానో లేదో తెలీటం లేదు
మళ్ళీ వెనక్కి వదిలేసిన మూఢ నమ్మకాల
మధ్యకే వెళ్ళిపోతానని భయం వేస్తోంది
అప్పుడప్పుడు మూట బరువెక్కి
ఎక్కడో వదిలేయాలనిపిస్తోంది
అమ్మో దాన్ని వదలడం ప్రాణాలను
వదలడం కన్నా కష్టం.

అబ్బ యీరాత్రి గడుస్తుందా
ఈ అచేతనత్వం - నిశ్శబ్దం మరణిస్తుందా.

అదిగో తెల్లవారుతూన్నట్టుంది
సూర్యుడు కనిపించటంలేదు కాని
దారి కన్పిస్తోంది - చెట్లూ చేమలూ అన్నీని.
దగ్గరగానే చిన్నపల్లె
ఈ మధ్యనే కట్టుకున్నట్టున్నారు ముద్దుగా
చలిమంటచుట్టూ కూర్చున్నవాళ్ళు
ఉల్లాసంగా కబుర్లు చెప్పుకుంటున్నారు.

అప్పుడే లేచినట్టుంది పిల్లల్ని వెంటబెట్టుకొని
ఆహారం కోసం బయలుదేరింది కోడిపెట్ట
పిల్లలు చాలా చలాకీగా ఉన్నాయి.

ముందు ముందుగా పోతున్నాయి ఒకదాన్నొకటి తోసుకొని
ఇంతట్లో "కావిలాకం" "కావిలాకం" అని
వికృతంగా అరిచింది ఒక గద్ద

పైకి చూశాను అబ్బా గద్దలకేమధ్య
రెక్కలింత పెద్దవైపోతున్నా యేంటి అని
చాలా భయం వేసింది నాకే
పైన వలయాల్లో తిరుగుతూ
లీటర్లకొద్దీ విషవాయువుల్ని కురిపిస్తోంది
కోడిపిల్లల్ని తన్నుకపోడానికి విశ్వప్రయత్నం చేస్తోంది
కేవలం ప్రేమనీ నైష్కల్మశాన్ని ధరించి
సహాయంకోసం జాలిచూపు చూస్తోంది - కోడి
దాని అంతరాల్లోంచి అభిమానం ఆక్రోశిస్తోంది.

ఆ అరుపులు ధైర్యాన్ని బద్దలు చేయడంవల్ల కాబోలు
ఇందాకటినించీ కిందికి దిగలేక పోతోంది గద్ద

నాకు రెక్కలుంటే యెగిరి గద్దపీక నొక్కాలనిపిస్తోంది.
కాని శక్తిలో ప్రస్తుతం కోడీనేనూ ఒక్కటే
ఏదో చేసెయ్యాలనే ఉద్విగ్నతతో
ఒక పెద్ద వెర్రికేక పెట్టగలిగాను - అంతే....

# అగ్నిపంజరం

ఎస్. నారాయణ చౌదరి

అనాదిగా మనలో పెరుగుతున్నాడొక ప్రాచీన మానవుడు।
జంతు యంత్రాగారం నుండి ఆవిర్భావం పొందిన ఈ ప్రాచీనుని పరిణామంలో,
ఆకలి, కామం, ప్రేమ, ఆలోచన, అన్వేషణ, తిరుగుబాటు, విప్లవం;
రక్తంలో జీర్ణించి రంగులమేడైన నవీనుడు,
మొన్నమొన్నటిదాకా తన స్మృతులను నెమరువేసుకున్నాడు।

గడ్డిపూవులో సౌందర్యం, రోదసీలో విజ్ఞానం, అంతరాత్మలో ఆకలి అరపులు,
కలం కాగితంమీద పరుగిడగానే చరిత్రపేరుతో మానవజాతికి రూపం పోసి,
వర్తమానపుటావర్తాల ప్రభావం, పాపం, పుణ్యం, దీపం, చీకటి;
తన చుట్టూ విషాలు గ్రక్కుతున్న పరిధులబాటలు విస్తరించి,
తన పరిణామాన్ని మేలిముసుగుతో కప్పివేస్తున్నాడు ...!!

ప్రియురాలి అందాన్ని చూపులతో వర్ణించి, "సర్వం సౌందర్యం" గా,
తృప్తిపడిన భావుకుడు, విహంగలోకంలో విహరిస్తూ,
తాకటానికే జంకువేసి, ఆరాధన పేరుతో కామానికి కొత్తపేరుగ
తనలోని తనవాణ్ణి, అనాదివాణ్ణి, హత్యచేయాలని చూస్తున్నాడు।

కలల్లో విజృంభించిన ఏడు తలల నాగులు,
ముప్పది రెండు మేడమెట్లు,
రెండు మోటారు కార్ల మధ్య 'యాక్సిడెంట్',
పొంగివచ్చిన సముద్రపు టున్మత్త కెరటాలు,

ఎఱ్రటి అగ్ని జ్వాలలు,
తను పవిత్రంగాజూచే ఆడదాని పెదవులపై పల్చటి ముద్దులు –
నిద్దురలేవగానే భయంతో, గుండెదడతో, చెమటతో
భయంకరం - పాపం అని విలపిస్తూ,
తన పగటి జీవితంలో చిరకాలంగా అణగారిన కోర్కెలు
బుసలుగొట్టి, తనలో ఆవులించిన, ప్రాచీన స్వరూపాన్ని గుర్తించటమే మానేశాడు।

స్త్రీ నగ్నశరీరంపైనే కేంద్రీకృతమైన 'సెక్సుస్పిరిట్' తో,
చైతన్యాన్ని నిట్టనిలువునా చీల్చి, నాలుగడుగులు వెనక్కు వేసి,
ప్రాచీనుని కౌగిలి గుర్తించక,
ప్రశ్నించటానికి వీల్లేని 'పవిత్రత' నాపాదించి
సెక్సునతిరమణీయంగా, సుందరంగా, పాలరాతి శిల్పంలా తీర్చిదిద్దాడు।

చిరకాలం ప్రోగుజేసుకున్న సభ్యతా, సంస్కారాలతో,
సమాజానికి సైతం రెండడుగులు పైకెదిగి,
రెండు బుడ్డీల బ్రాందీమత్తులో నడిరోడ్డులో పాకీపిల్లను
తనలోని ప్రాచీనుని కెరచేశాడు....।

తనలోని మరొక్కడు, మరొక్క మనిషి,
ఇంతకు కారణమని గుర్తించేందుకే చిహ్నాలు కన్పిస్తున్నాయ్।
మానవజాతి యావత్పరిణామదశలో, వైవిధ్యాలు వైరుధ్యాలు,
రక్తపుబిందు మధ్యభాగంలో నిరంతరం సంఘర్షిస్తున్నాయ్।।
కాబట్టే ప్రతి మనిషీ ఒకడుగాదు -
రెండు రంగులు, రెండు నీడలు, ఒకదీపం, ఒకచీకటి,
అందుకే అంటున్నాను
అనాదిగా మనలో పెరుగుతున్నాడొక ప్రాచీనమానవుడు .. ।

# కూలి

## అమృతలత

పుచ్చిపోయి పుళ్ళుబారి
డొక్కలన్నీ డోక్కుపోయి
మురికి పేరుకు ఆ గుంటలో
మూల్గుతోన్న ఊర కుక్కలా
మంచిమనసు మసిబారి
మమతలన్నీ బూజుబట్టి
దరిద్రాన్ని ఈడ్చుకొస్తూ
ధరణి నేలుతున్నాడు
ఆగుడిసె వాని సామ్రాజ్యం
ఆరుగురి పిల్లలతల్లి పట్టమహిషి

అహోరాత్రులు స్వాగతంపలికే దోమలు
అంగరక్షకుల్లా వెన్నంటే ఈగలు
అమాత్య శేఖరులై 'కాపాడే' నల్లులు
అపూర్వమైన వాని ఆస్తి పాస్తులు

చిక్కిపోయి చిరిగిపోయి
లచ్చిదేవిని వెక్కిరిస్తూ చచ్చినట్టు వేళ్ళాడే
గోచీ — బనీనే వాడి చీనీ చీనాంబరాలు

ముక్కిపోయి మురిగిపోయి
బిర్రబారి బిగుసుకొన్న
పంచభక్ష్య పరమాన్నం
పదిరోజులనాటి రొట్టె

కథ

# ఆయనింకా రాలేదు

తిరుపతయ్య

క్రమంగా అలుముకుంటున్న చీకటి. నాగరికతను తాకలేక, ఆకాశాన్నందుకో లేక భూమ్యాకాశాలమధ్య నిలిచిపోయిన చీకటి. ట్యూబ్ లైట్ల వెలుతురులో నడిచిపో తున్న జనం. నక్షత్రాలకాంతిలో నడచిపోతున్న మబ్బులు. పిచ్చుకల శబ్దం తగ్గి పోయింది. రోడ్డుమీద కలకలం హెచ్చుతోంది. మనసులో కలవరం చోటుచేసు కుంటోంది. "ఆయనింకారాలేదు"

రోడ్డు నానుకునివున్న డాబామీద పిట్టగోడకానుకుని కుర్చీవేసుకు కూర్చుంది శాంత. ట్యూబ్ లైట్ల వెలుతురులో అంతదూరం ఆమెకూ, అంతదూరానికి ఆమే కనిపిస్తారు. ఆయనొస్తే అంతదూరంనుండే కనిపిస్తాడు. రోడ్డు వచ్చే పోయే వారితో రద్దీగావుంది. పరుగులు పెడుతోంది. "ఆయనింకారాలేదు".

"ఇంకా ఎందుకు రాలేదో! ఎవరన్నా స్నేహితునింటికి పోయి .... రోజూ స్నేహితునింటికే అనుకోవాలా? ఆఫీసులో పనుండి ఉన్నాడేమో! గార్డెన్‌లో కాసేపు కూర్చుని వస్తాడేమో! లైబ్రరీకి పోయి కాసేపు చదువుకునివస్తాడేమో! వస్తుంటాడు. బహుశా ఈపాటికి బయలుదేరవచ్చు"

"ఇవ్వాళ ఇష్టమని ... ఎవరికి? ఎవరి కిష్టమని? ఎవరికైతేనేమిలే! లేతాకు పచ్చచీర, దానికి సరిపోయే బ్లౌజూ వేసికుంది. తలంటిపోసికున్న వెంట్రుకలకు నూనె రాయకుండా, సగంజడవేసి వదిలేసింది. వెన్నెలకింద ఆయనతో డాబామీద పసిపచ్చికలాంటి కబుర్లాడాలనుకుంది. "ఆయనింకారాలేదు"

శాంతకు విసుగుపుడుతోంది. మెట్లు మెల్లగాదిగి గదిలోకివచ్చింది. అద్దంలో చూచుకుంటూ కాస్త పౌడరద్దింది. గుండ్రటిబొట్టు చెరిపేసి దోసగింజబొట్టు పెట్టింది. గ్లాసులో నీళ్ళమీద తేలుతున్న మల్లెమొగ్గదండ తలలో పెట్టుకోబోయి ఆగింది. "ఆయన..." అనుకుంటూ ముసిముసిగానవ్వి మళ్ళీ గ్లాసులోవేసింది. ఆయనవస్తే ఏడ్పించి తలుపు తీయాలనుకుంది.

శాంత మళ్ళీ ఓమారు అద్దంచూచి డాబాఎక్కింది. రోడ్డు మీదకాంతికీ చీకటికీ యుద్ధం జరుగుతోంది. ఓ జంట—దాదాపు అతుక్కుపోయినట్లుగా నడుస్తున్నారు, శాంత వాళ్ళనుచూసి సంతోషించి ఈర్ష్యచెందింది. "వాళ్ళకు పరిసరాలు కనిపించడం లేదు. ఎక్కడికిపోతున్నారో? పార్కుకా? షాపింగుకా? సినిమాకా? కోవెలకా? ఎక్కడికైతేనేం? ఎక్కడికైనాపోవచ్చు అలాననుస్తూ." ఓ పోకిరి డాబాక్రింది రోడ్డుమీద తలయెత్తి సన్నగా ఈలవేశాడు. శాంత అటుచూసింది. వాడు ఏమెరుగనట్లుగా కాళ్ళు చేతు లూపుకుంటూ పోతున్నాడు. శాంత కసహ్యంవేసింది. తర్వాత చిన్నగా నవ్వుకుంటూ పైటసర్దుకుంది. "ఆయన వచ్చేజాడ కనిపించలేదు"

"అదుగో! ఆయన ఒంటరిగాపోతున్నాడు. తలవాల్చుకు నడుస్తున్నాడు విచారంగా. అతనికి భార్యపుందా? ఉంటే మరి వెంటరాలేదేం? వాళ్ళిద్దరికీ సరిపడదా? ఆమె ఈయనకి తగదా? పాపం" అతన్నిగురించి అట్లాఊహించి జాలిపడుతున్నందుకు శాంత సిగ్గుపడింది. కాసేపు ఆకాశాన్ని, కాసేపు రోడ్డునూ పరీక్షించింది. "ఆయన వచ్చేజాడ కనిపించలేదు."

చర్చిగంటలు ఎనిమిదిసార్లు మ్రోగాయి. గాలివేగం హెచ్చింది. ఎండిపోయి కూడా ఇంకా రాలిపోని దిరిసెనకాయలు పనిలేని ముసలాళ్లలా వదురుతున్నాయి. పోలీసు విజిల్ వినిపిస్తోంది. రిక్షావాడికండలు తిరిగినశరీరం, రిక్షాబెల్ మ్రోగిస్తూ ట్యూబ్‌లైట్ల కాంతిలో క్షణకాలంమెరిసింది. కాలేజికుర్రాడిలా ఉన్నాడు — కాలరెత్తి జుట్టు నుదురుమీదపడేలాదువ్వి, సిగరెట్ పీలుస్తూ, షోగ్గానడుస్తూ, ఓ చూపువిసిరి పోతున్నాడు. శాంతకు గర్వంకలిగింది. చూపులు దించుకోకుండా అటేచూస్తూఉంది 'ఆయనవచ్చే జాడ కనిపించలేదు.'

"చదువుకునే రోజులు ఎంతహాయిగా గడిచాయి! మురళి సన్నగా అమ్మాయిలా ఉండేవాడు. క్లాసులో దొంగచూపులు చూసేవాడు. తనుచూస్తే తలదించుకునేవాడు

కరుణాకర్‌కు పెద్ద పర్సనాలిటీ, మీసాలున్నా అమ్మాయిలంటే తగనిభయం. మరింక కిషన్ – అంతా 'కోతి' అనేవారు. సుందరికి ప్రేమలేఖకూడా వ్రాసాడు. సుందరి ఆ ఉత్తరాన్ని ప్రిన్సిపాల్ కిచ్చింది. తనైతే....తనైతే ... ఏంచేసేది తనైతే? ఓహ్!'' శాంతకు ఓపిక తగ్గుతోంది. "ఆయన వచ్చేజాడ కనిపించలేదు.''

"ఆరోజు - రామప్ప గుళ్ళల్లోకి ఎక్స్‌కర్షన్ పోయినప్పుడు, ఆనగ్నశిల్పాలను చూస్తూ శేఖర్ తన్మయుడై అప్పుడే ఓ గేయంవ్రాసి చదివి వినిపించాడు. అతనితో మాటాడాలని తనకెంతోకోరిక. కాని అరుంధతి అతన్ని ప్రేమించి పెళ్ళికూడా చేసుకుంది. అరుంధతి నిజంగా అదృష్టవంతురాలు. అంటే తను? తనుమాత్రం? తనకేంలోటు? ఒంకంత ఇల్లు, ఆస్తి - యువకుడైన భర్త. తనకేంలోటు? ఏంలోటు? అబ్బా!'' శాంతకు తలనొప్పి వస్తోంది. 'ఆయన వచ్చేజాడ కనిపించలేదు.'

"ఆ లెక్కల లెక్చరర్ స్టాఫ్‌రూములో ఎవరూలేనపుడు ప్రాబ్లం అడుగుతే నోటుబుక్కందుకొంటూ మెల్లగా వ్రేళ్ళనుతాకాడు. ఇంకెక్కడి సాల్వ్! గ్రుడ్లప్పగించి తన ముఖంచూస్తూ కూర్చున్నాడు. తనానాడెంత గర్వించింది? పాపం ఆయన భార్య అనుకూలవతికాదట. ఆనాడు అతడు బికియస్తుడు కాకపోతే? కాకపోతే? ఏమయ్యేది కాకపోతే? ఛ ఛ!'' శాంత కన్నుల్లో నీళ్ళుతిరిగాయి. 'ఆయన వచ్చేజాడ కనిపించలేదు.'

ఎదురింటి రంగనాథం ఇంట్లో తొమ్మిది గంటలు. ఆయన భార్య పుట్టింటికి పోయింది ప్రసూతికి. "అమాయకురాలు పాపం, పనిమనిషితో సరసాలూవాడూ. ఆ మంగి రంగుల చిలుకలా రంగనాథంతో సరసాలాడడం తనెన్నిసార్లు చూడలేదు? అది అతనివొళ్ళో చేరడం తన కెన్నిసార్లు కనిపించలేదు? ఛీ! ఛీ! లోకంలో నీతిలేకుండాపోతోంది. ఆ రంగనాథం తననుచూసి పళ్ళన్ని బయటపెట్టి నవ్వుతాడు కిసుక్కున. ఏమనుకున్నాడో కాని! అతడంటే తనకసహ్యం. అబ్బ! ఎంతధైర్యం! నిన్న ఇదే సమయంలో '!పొద్దుగడవడంలేదూ! రండి మాయింట్లో మాటాడుకుందాం' అంటాడావెధవ? ఎవరూ వినలేదుకాని - ఏంటే ఇంకేమన్నావుందా? తాను మాటాడకుంటే దగ్గరగావచ్చి చేయిపట్టుకుంటాడా? తను మేల్కొని ఛీ! అంటూ చేయివిదిలిస్తే కిసుక్కున నవ్వుతాడా? వాడి పనిపట్టాలి. ఎలా? ఎలాపట్టాలి. అబ్బా!'' శాంత కణతలమీద ఎవరో సుత్తితో బాదుతున్నారు. 'ఆయనింకా అప్పుడే వచ్చేట్టులేదు."

శాంత దాబాదిగి గదిలోకివచ్చింది. "రంగనాథం ఉన్నాడా? సినిమాకుపోయాడేమో! ఎవతె దగ్గరకన్నా పోయాడేమో! అంతపనీచేస్తాడు. అయినా భార్యకు కడుపాయె పాపం. కడుపయితే? .. కడుపయితే ..?" శాంత విచ్చుకుంటున్న మల్లెదండ తలలో తురుముకుని తలుపు మెల్లగాతీసింది. మూసినతలుపుకు తాళం. గబాల్న తలుపుమూసి తలుపు నానుకుని బోరున ఏడ్చింది. "ఆయన అప్పుడే వచ్చేట్టులేదు,"

"ఏమయింది తనకు? ఏమవుతోంది తనకు? మనసులో శిఖరంనుండి లోయలో పడే సెలయేరు చప్పుడెందుకు? హృదయంలో అగ్నిపర్వతాలు బ్రద్దలైన శబ్దం ఎందుకు? గుండెలో సముద్రుని బడబానల జ్వాలలకీలలు ఎందుకు? ఏమయింది తనకు? ఏమవుతోంది తనకు?" శాంత ఆలోచనలు గోదావరి వరదల్లా పరుగెత్తుతున్నాయి. ఆమె గబగబావెళ్ళి మంచంమీదపడి తనివితీరా ఏడ్చింది. హృదయం చల్లబడేవరకూ కన్నీళ్ళుకార్చింది. 'ఆయన వస్తాడు. ఇవ్వాళగడచిపోకుండానేవస్తాడు. ఎందుకురాడు?'

శాంత మౌనంగా ఆలోచనల కానకట్ట కడుతోంది. కాసేపటికి మెల్లిగాలేచి అద్దందగ్గరికి పోయింది. కన్నీటి చారలున్నా ఉజ్వలంగా నివురులేని నిప్పులావుంది ప్రతిబింబం. శాంత గ్లాసులోని నీళ్ళతో ముఖం తుడుచుకుంది. 'ఆయన వస్తాడు ఇవ్వాళ గడచిపోకుండానే వస్తాడు. ఎందుకురాడు?'

తలలో మల్లెమొగ్గలు విచ్చుకున్నాయి. రోడ్డుమీద అప్పుడప్పుడు కారుదూసుకుపోయిన శబ్దం. ఉండి ఉండి రిక్షాగంటలచప్పుడు. దిరిసెనపూలు మత్తును వెదజల్లుతున్నాయి. 'చదువూ, సంస్కారం; ఆస్తీ, అంతస్తు; అందమూ, వయసు ఉన్న వాసుదేవరావు భర్తకావడం అదృష్టమే కాని లోటు. తను విడమరచి చెప్పలేని లోటు. అతనిలో ఉత్సాహంలేదు. ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్నట్లు పరధ్యాన్నంగా ఉంటాడు. పెళ్ళయిన మొదట్లో ఎవరినన్నా అంతకుముందే ప్రేమించాడేమో అనుకుంది తను. కాని అదికాదట. అదయినా బాగుండేది. అతని తరహా అంతేనట. తను బాగుచేసుకోవాలట. అత్తవారి ఇంట్లోనివాళ్ళ మాటలసారాంశం అది. దారికి వస్తాడా?"

"ఎందుకురాడు? తనుచూస్తే తప్పకుండా మారాలి. కాని .... కొన్నాళ్ళ తర్వాతనైనా అతనిలో ఉత్సాహాన్ని, ఉరుకులాపరుగులతో తనను గుక్కతిప్ప

కోకుండా ముంచెత్తే ఉత్తేజాన్ని ఎందుకు చూడకూడదు! తప్పకుండాతను చూస్తుంది. అమ్మయ్య ఆయన వస్తాడు. ఇవ్వాళ గడచిపోకుండానే వస్తాడు. ఎందుకురాడు?"

"శాంతా! శాంతా!" తలుపు చప్పుడైంది. శాంతకు ప్రాణాలు లేచివచ్చాయి. వెంటనే పోయి తలుపు తీయాలనుకుంది. కాని కాసేపేడ్పించాలని ఆలస్యం చేసింది. "ఓ శాంతీ! తలుపుతీయవేమే మొద్దూ!" అనంటే బాగుండుననుకుంది. కాని తలుపు మీది గొళ్ళెం చప్పుడే ఎక్కువైంది. శాంత నిద్రను నటిస్తూపోయి ఆవులింతలుతీస్తూ తలుపుతీసింది. అతడు లోపలికివచ్చాడు రోజులాగే. అచ్చం ప్రతిరోజులాగే వచ్చాడు.

"మా స్నేహితుడు తన భార్యతో సినిమాకుపోతూ నన్ను రమ్మన్నాడు. అందుకే ఆలశ్యమైంది. వాళ్ళింట్లోనే భోజనం చేసివచ్చాను. నువ్వెళ్ళి భోంచేయి. నాకు నిద్రవస్తోంది" వాసుదేవరావు చొక్కావిప్పి మంచంమీద పడుకున్నాడు. శాంత చెంపమీద చెళ్ళున చరచినట్లైంది. కండ్లనిండా నీళ్ళుతిరిగాయి. తనలాంటి అల్పక్రిమి ప్రపంచంలోనే లేదనిపించింది. నిన్నటి రంగనాథం నవ్వుచు హృదయంలో సూటిగా గుచ్చుకుంది శూలంలా. ఆబాధంతా అణచుకుంది అతిప్రయత్నంతో.

"మీరూరండి. ఊరికేకూర్చోండి అక్కడ." దీనంగా, దుఃఖపు పొరలు అడ్డంరాగా అంది శాంత.

"వద్దుశాంతా! అక్కడే గొంతువరకు తిన్నాను, బాగా నిద్రవస్తోంది." అంటూ అటువేపుతిరిగాడు. శాంతకు సర్రున కోపంవచ్చింది. ఎక్కడలేని అసహ్యం కలిగింది. కండ్లు అగ్నిగోళాలయ్యాయి. శరీరం నల్లత్రాచులా పడగవిప్పి, తోకమీద నుంచున్నట్లుగా బుసకొట్టింది. కాసేపునుంచుని - కదిలే శిలలా వంటింట్లోకిపోయి అన్నింటిమీదా మూతలుమూసి తలుపేసివచ్చింది.

వస్తూనే శాంత కొయ్యబారిపోయింది. వాసుదేవరావు సన్నగా గురకపెడు తున్నాడు. అతని తలప్రక్క తన మెత్త, శాంత విలవిలలాడింది. తలలోని మల్లె దండనుతీసి దూరంగా విసిరిపారేసింది. బయట రంగనాథం తలుపు తీస్తున్నశబ్దం. ఎవరో స్త్రీతో మాటాడుతున్న అలికిడి. ఆ తర్వాత రిక్షాక్రింద కాలిరికిన కుక్కపిల్ల కుయ్యోమనే అరుపు. అది తన గుండెలుకోసి గొంతుదాకావచ్చి ఆగిపోయిన ఆక్రందనలావుంది. శాంత తలగడాతీసి కిందేసింది. లైటార్పింది. గది తనమనసులో చీకటినింపుకుంది. శాంత తలగడాచేరింది. రంగనాథం తలుపుమూస్తూ నవ్వాడు కిసుక్కున, శాంత కొంగును బలంగా నోట్లో గ్రుక్కుకుంది.

—

కథ

# ప్రతిబింబాలు

ఆర్. వసుంధర

బాగా ప్రొద్దెక్కితేగాని లేవని నాకు ఈరోజు ఆరు గంటలకే మెలకువ వచ్చేసింది. ఇంత ప్రకృతి సౌందర్యములోవుండీ సూర్యోదయపు అందాల్ని రోజూ ఆస్వాదించలేకపోవటం విచారకరమైన విషయమే అయినా ఆ నిద్రలోవుండే హాయి యీ ప్రపంచంలోని మరేవిషయంలోనూ కనుపించదు నాకు. వయసు మీరిపోతున్న బ్రహ్మచారిణులైన స్త్రీలు తమచుట్టూ తాము నిర్మించుకునే వింతచేష్టల కవచంలో యిదీ ఒక భాగమేమో అనుకున్నాను. నవ్వువచ్చింది. నిజానికి నావయసు ఎప్పుడూ జ్ఞాపకం వుండదు నాకు. ఇరవైయేళ్ళ వయసులో వున్నప్పటి నా మనఃస్థితికీ యిప్పటి స్థితికీ యేమీ భేదం కనుపించటంలేదు. అందువలననే కాబోలు 'వయసు మీరిపోతున్న' అనుకున్నపుడు అదేదో నాకు సంబంధించని విషయంలాగా హాస్యంగా అనిపిస్తుంది.... కాని యీవూరికి ట్రాన్స్‌ఫర్ అయివచ్చిన తరువాత యీ నాలుగు నెలల్లోనూ వయసు మీరుతున్నదేమోనన్న భావన — నాకు ముప్పైఅయిదేళ్ళన్న విషయం — లీలగా మనసు వెనకాతల మెదలుతున్నట్లున్నది. హాస్టలులోని ఆడపిల్లల్ని ఎగతాళిచెయ్యబుద్ధి వెయ్యటంలేదు. వాళ్ళంతా చిన్నవాళ్ళలా, మరోతరం వాళ్ళలా, కన్పిస్తున్నారు. బహుశా అమ్మ దగ్గర లేకపోవటంవలన యీమార్పు వచ్చివుండవచ్చు. అమ్మ నన్ను 'చిన్నా' అంటుంది. అన్నం తినకపోతే బ్రతిమిలాడుతుంది. అన్ని బాధ్యతలూ నవ్వుతూ నిర్వహించుకొంటుంది. అరవైఏళ్ళు దగ్గరపడుతున్నా పురకలు పరుగులతో పనులు చేసుకుంటుంది. అమ్మకుండే ఓపిక ఉత్సాహాల్లో వీసంవంతు లేవు నాకు. జీవితం అర్థరహితంగా పేలవంగావున్నది. పనిలేకుండా ఆలోచనాలేకుండా వూరికే పడుకొనివుండటం, నిద్రపోవటం అనేవి రెండే యిష్టమైన పనులు నాకు. అమ్మకంటే

రెట్టింపు వుత్సాహంతో పనులు చూసుకుంటూ జీవంతో తొణికిసలాడుతూ వుండవలసిన వయసులో యీ'నిర్జీవత'ను వరించటంలోని చెడతపేచీ ఏమిటో నాకు తెలియదు. దీక్షతో ఆశతో ఆనందంతో పరుగులెత్తి అందుకోవలసిన చుక్కల్లాంటి విలువలు, ఆదర్శాలు యిప్పటి కాలపరిస్థితుల్లో జీవితంలో లేవనిమాత్రం తెలుసు. ఎందుకు? ఎందుకు? ఎందుకు? ఒక్కప్రశ్నే నాలుగుమూలల్నించీ నిరంతరం వినబడుతూవున్నది.

నా దినచర్యలో ఒక ముఖ్యభాగం ఉత్తరాలకోసం ఎదురుచూడటం. పోస్టు యింకోగంటకు వస్తుందన్నప్పటినుండి ఎదురుచూడటం ప్రారంభమౌతుంది. వాకిటి ముందునుండి వెళ్ళే ప్రతి అడుగులచప్పుడూ పోస్టుమేన్‌దేమోనన్న భ్రమ కలిగిస్తుంది. మనసంతా రాబోయే పోస్టుమేన్ మీదనే కేంద్రీకరించబడుతుంది. గడియారం అతి మెల్లగా కదుల్తుంది. ఆఖరికి వచ్చిన వుత్తరాలకట్టలో నాకోసం ఒకటో అరో వుంటుంది. 'అమ్మ దగ్గర్నుండేనా!, 'కమల దగ్గర్నుండేనా!' అంటూ ఎవరిదగ్గర్నుండీ వచ్చినా 'ఇంతేనా!' అనిపిస్తుంది. నేను దేనికోసం ఎదురుచూస్తున్నానో నాక్కావల్సిందేమిటో నాకే తెలియదు! నిన్న యిలాగే అమ్మ దగ్గర్నుండి వచ్చిన ఉత్తరంలోని విషయం కొంతలోకొంత ఉత్సాహం కలిగించింది. ఇవాళ అమ్మ వస్తున్నది. అమ్మ దగ్గరుంటే కొంతైనా సరదాగా వుంటుంది.

'హోంసైన్సు యం. యస్సీ చదివావు. పరీక్షకోసం నేర్చుకున్న పూరీలు తప్పించి యింకో వంటరాదాయెను. నేర్చుకోబోయి చెడగొట్టిన రెండు గుడ్డలు తప్పించి యింకో గుడ్డముక్క కత్తిరించకపోతివి. ఒక్కపనీరాదు. ఏం చదువులు!' అంటుంది అమ్మ.

'వెధవపనులు! నాకెందుకు లేనిపోని శ్రమ. వంటవాళ్ళూ టైలర్లూ ఎందరో వుంటారు. డబ్బుపారేస్తే వాళ్ళు శుభ్రంగా చేసేపనులు నేనెందుకుచెయ్యాలి?' అంటాను.

అమ్మ ఉత్సాహంగా నవ్వుతుంది.

ఆమెజుట్టు వయసులో నలుపూ తెలుపూ కానిరంగుకు మారిపోయింది. 'అమెరికాలో అయితే నీజుట్టుని మెచ్చుకుంటారు. ఈరంగు జుట్టుండేవాళ్లకు మహాయిష్టం. ప్లాటీనం బ్లాండ్... ' అని ఎగతాళిచేస్తే నవ్వుతుంది .........
అయినా ఎన్నాళ్ళీ అమ్మచాటుసుండటం! అందుకే యీపూట్కో యిల్లు తీసుకోకుండా

హాస్టలు వార్డెనుగాపుంటున్నాను. అమ్మ అక్కడగ్గరున్నది. కాని ఆమెలేని యీ నాలుగు నెలల్లోనూ యీ ఆడపిల్లలముందు వయస్సు మీరిపోతున్నట్లుగా వున్నది నాకు.

హాస్టలు వెనగ్గా పెద్ద చెరువు. చెరువుకావల సూర్యోదయం అవుతుంది. ఒచ్చిన కొత్తల్లో ఒక రోజున చూశాను. అదోరంగు ఎరుపులో నున్నటిగోళంగాపుట్టి పసిడి రంగును సంతరించుకొని క్రమంగా తెల్లగామెరిసే అగ్నిగోళంగా మారిపోయాడు. 'పుట్టేటి భానుడా పుష్పరాగపుఛాయ, పుష్పరాగములోన ..' అన్న పద్యంలో మాదిరి గానే రంగులు మార్చుకున్నాడు. ఇవేళ చూస్తుండగానే పుట్టడమే తెల్లగామెరుస్తూ పుట్టేశాడు. ఏమిటీ యివాళ విశేషం! ఇవాళ అమ్మ వస్తున్నదని నీకూ తెలుసా? అనుకుని నవ్వుకున్నాను.

'బాత్‌రూమ్‌లో వెన్నీళ్ళు పెట్టానమ్మా' అన్నాడు రామసుబ్బు.

'నీవూ తొందరగానే వచ్చేశేవా? ఏమిటివ్వాళ విశేషం!' అన్నాను. రామసుబ్బు కళ్ళువాల్చి నవ్వి సిగ్గుగా తలదించుకున్నాడు. రామసుబ్బు ఎప్పుడూ కళ్ళువాల్చి సిగ్గుగా నవ్వుతాడు. సినిమాలోని అమాయకపు హీరోలాగా. అయినదానికీ కానిదానికీ అన్నిటికీ అదేనవ్వు. నాటకాల్లో వేషాలు వేస్తాడట. ఇదీ వేషమేమో అనుకున్నాను మొదట .. ,పైన నాటేబిల్‌మీద చిన్న మెమో పుస్తకంవున్నది. తెమ్మన్నాను ఓరోజు. టేబిల్‌మీదున్న పాతికపుస్తకాలూ పట్టుకొచ్చాడు. నాకోపంవచ్చింది. నీవు స్టుపిడ్‌వా లేక అతివినయమా? అనడిగాను. క్షణంలో సగంలో మొహంమీది నవ్వు మాసిపోయి కళ్ళు పెద్దవై దెబ్బతిన్నవాలకం వచ్చేసింది. 'ఏ పుస్తకమో తెలియక, ఎందుకైనా మంచిదని ' అన్నాడు మొహం వ్రేలవేసుకొని. పని సరిగ్గాచేద్దామన్న వుద్దేశ్యంతో తెచ్చాడుగాని నేను అంతగా తిట్టేస్తాననుకున్నట్లు లేదు పాపం. అదంతా వేషంకాదనీ స్వాభావికమైన విశేషమనీ తర్వాత తెలిసింది నాకు. వంటవాడి ఎసిస్టెంటుగా రామసుబ్బుకు వుద్యోగం యిచ్చింది నేనే. అందుకేనేమో నన్ను మెప్పించాలని చాల ప్రయత్నిస్తాడు. మిగతా పనివాళ్ళలాకాదు. వాళ్ళు పని తప్పించుకోవాలని ప్రయత్నిస్తారు. దూరంగా కనుపించగానే ప్రక్కకు తప్పుకుంటారు. ఎదురుగా వచ్చినప్పుడు నిటారుగానిలబడి నమస్కారంచేస్తారు. 'ఇవేళ ఎండ ఎక్కువగావున్నది' అనగానే 'అవునమ్మా. చాలా మాడ్చేసింది' అంటారు. వెంటనే 'ఏమిటింత చల్లగావుందీ' అంటే 'అవునమ్మా ఎందుకో చల్లగావుంది' అని సాలోచనగా తలవూపుతారని అను

భవంమీద కనుక్కున్నాను. అందరూ ఒకచేరకం. ఈ ప్రాంతపుతీరు కాబోలు. మొదట్లో రామసుబ్బూ అంతే ననుకున్నాను. 'అతివినయం ధూర్తలక్షణం' అనుకున్నాను. నిజమైన ఆదర్శసేవకులు యీకాలంలో వుండటానికి వీల్లేదు. ఆదర్శాలనేవీ, మంచిఅనేదీ కథల్లోనూ సినిమాల్లోనూ బాగుంటాయిగాని నిజజీవితంలో అపహాస్యంపాలు జేస్తాయి. తలబొప్పి గట్టిస్తాయి. దాన్ని మనుష్యులు 'సెంటిమెంటాలిటీ' అంటారు. అబలలూ అనుభవహీనులూ మూర్ఖులూ నమ్మేవి అంటారు. లౌకిక వ్యవహారాల్లో మంచితనానికీ చచ్చుతనానికీ భేదం వుండదు. ప్రేమ, స్నేహం, జాలి, క్షమాలాంటి గుణాలు మనుష్యుల్లోలేవని ఎన్నోసార్లు తెలిసింది నాకు. అన్నిటికీ అట్టడుగునవుండేది స్వార్థం. మంచితనంకోసం వెతికి వెతికి నిరాశచెందాను. కేవలం నా సుఖంగురించి ఆలోచించవలసిన అమ్మ ఒకనాడు 'డబ్బు దుబారాచెయ్యకుండా వెనకేస్తే అన్న పిల్లలకు పనికివస్తుంది' అన్నప్పుడు మాతృప్రేమలోకూడా నమ్మకం పోయింది నాకు. అందుకే రామసుబ్బు అనే పని కుర్రవాడిలో యీ పాతకాలపు లక్షణాలున్నాయని గుర్తుపట్టడానికి నెలరోజులుపట్టింది. తర్వాత 'పాపం, అమాయకుడు' అని జాలిపడ్డాను.

రామసుబ్బులోని మంచితనం అమాయకత్వం చూచాక నాలో చాల మార్పు వచ్చింది. ఏ కాలంలోనో అడుక్కు నెట్టివేయబడ్డ ఆదర్శ శిఖరాలు పైకిలేచాయి. మంచితనంలో మానవతలో తిరిగి విశ్వాసం కలిగింది. రాములవారిని చూచిన ఆంజనేయునిలా రామసుబ్బు నన్ను చాల గౌరవభావంతో చూసేవాడు. 'పాతవార్దైనమ్మ అందరిదగ్గరా చాడీలూ వెనక మాటలూ వినేవాళ్ళంటమ్మా. మీరు న్యాయంగా పోవటమేగాని అలాంటిపనులు చెయ్యరు', 'పావలాయిచ్చి రెండణాలసామాన్లుకొంటే కొట్టువాళ్ళు పన్నెండుపైసలు వెనక్కిస్తే ఆమె వూరుకునేదికాదట. డబ్బుదగ్గర చాల కచ్చితం. మీరైతే ధారాళంగా వుంటారని అందరూ అంటున్నారు' 'పనివాళ్లు డ్యూటీకి కాస్త ఆలస్యంగావచ్చినా, సెలవడిగినా, తప్పుచేసినా పాతమ్మగారు చాలా కఠినంగా వుండేవారట. మీరు అన్నీ అర్థం చేసుకుంటారు.' ఇవన్నీ ముఖప్రీతికోసం ఒక్కసారి అన్నమాటలు కావు. అప్పుడప్పుడూ మాటల్లో బయటపడ్డవిషయాలు. జీవితమంటే కేవలం స్వార్థంకోసం మలుచుకున్నదిగా కాకుండా ఉన్నతమైన విలువల్ని, ఆదర్శాల్ని సాధించేదిగా చూడగలవాళ్ళు కొందరైనా వున్నందుకు సంతోషం కలిగింది.

అమ్మకు గులాబ్‌జాం అంటే చాల యిష్టం, ఆమె వచ్చేసరికి చేయించిపెడితే సంతోషిస్తుంది కదా అనిపించింది. నాకు స్వీట్సుమీదగానీ యితర తినుబండారాల మీదగాని మోజులేదు. చిన్నప్పుడు అమ్మ బియ్యం నానబోసి, పిండిదంపించి, భారీ ఎత్తున టిఫిన్లు తయారుచేస్తుంటే నాకు విసుగనిపించేది. తిండికోసం యింత గందర గోళం ఎందుకు! అనికునేదాన్ని. 'ఇంత కష్టపడి తయారుచేసుకొని అవి తినకుంటే నేం!' అనేదాన్ని. ఇప్పుడూ ఆ అభిప్రాయం మారలేదు. కాని....యివాళ ఎందుకో నాకు సంతోషంగావున్నది. ఇవాళ సూర్యుడు పుట్టటమే తెల్లగాపుట్టాడు. నేను వున్న తమైన స్వభావం కలదాన్నని గుర్తించే రామసుబ్బు అనే పనికుర్రవాడు వున్నాడు ... ఔన్నత్యమనేది మనస్సును ఒక దివ్యతేజంలోమునుంచి ప్రకాశవంతం చేస్తుంది. హృదయాన్ని ఆనందంతో పరిమళింపజేస్తుంది..... ఇవాళ అమ్మ వస్తున్నది. నాలుగు నెలల తరువాత మంచికూతురుగా, నాకోసం కాకుండా, కేవలం ఆమెకోసం. ఈ ఒక్క పనిచేసి ఆమెను సంతోషపెట్టాలి. అందుకే రామసుబ్బుతో చెప్పాను - కావలసిన వస్తువులు తీసుకొచ్చి నా రూంలోనే స్టౌమీద గులాబ్‌జాం చెయ్యమని ......

'హోటలునుంచి తెప్పించావా, బాగుంది' అన్నది అమ్మ.

'కాదు. మేమే చేశాంలే' అన్నాను గర్వంగా.

ఆరోజు సాయంత్రం నేను కాలేజినుండి వచ్చేసరికి బాల్కనీలో అమ్మ రామసుబ్బుతో యిష్టాగోష్ఠి జరుపుతూవుంది. ముఖ్యంగా తన కూతురు గొప్పతనం మీద. మాటలు నా రూంలోనికి స్పష్టంగా వినిపిస్తున్నాయి. నవ్వుకుంటూ వింటున్నాను. అప్రస్తుతంగా మధ్యలో అన్నది అమ్మ, 'మా అమ్మాయి యివాళ నాకోసం గులాబ్ జాం చేసింది. ఈమధ్యన నేర్చుకున్నట్లున్నది' చాలా బాగాచేసింది అన్నది. ఇలా అంటున్నదేమిటా అని ఆశ్చర్యపోతూ విన్నాను. ఇందాకా 'మేమే చేశాం' అన్నప్పుడు నేనే చేశానన్నట్లు అర్థం చేసుకున్నది గాబోలు!

రామసుబ్బు ఏమాత్రం తడబాటులేకుండా అన్నాడు. 'అవునమ్మా అమ్మగారు నాచేత సామాన్లుతెప్పించి చేశారు. చాలా బాగా చేస్తారు' అని.

నాకు యీమాటలు సరిగ్గా అర్థంకాలేదు. ఏవిటో కలగాపులగంగా పొరపాటుగా వినిపించాయి ...గులాబ్‌జాం నేను చెయ్యలేదని రామసుబ్బుకు తెలుసునే! తానేగదా సామాన్లుతెచ్చి తయారుచేశాడు. నేనుచేశానని అంతఘట్టిగా ఎందుకు చెబుతున్నాడు?

మెల్లగా నామనసులో ఒక చిన్న అనుమానంపుట్టి పర్వతప్రమాణానికెదిగి కూర్చుంది. నేను అమ్మతో అబద్ధంచెప్పానని రామసుబ్బు అనుకుంటున్నాడా! .. నేను అబద్ధాలు చెప్పడం రామసుబ్బుకు ఆశ్చర్యం కలిగించలేదు! అందుకే ఏమాత్రం తొణక్కుండా నా 'అబద్ధాన్ని' సపోర్టుచేశాడు. నాది ఉన్నతమైన స్వభావమనీ, నాకు అల్పబుద్ధులులేవనీ రామసుబ్బు యిదివరలో అనుకోలేదా?

.... ప్రపంచంలోని మంచితనమంతా శిథిలమైపోయినట్లూ, జీవితంలోని రాగమంతా చెదిరిపోయినట్లూ అనిపించింది. నన్ను నిస్పృహ ఆవరించింది....

'మీరురావటం నేను చూడనేలేదమ్మగారూ' అంటూ ఫ్లాస్కులో నుంచి కాఫీని కప్పులోనికిపోసి తెచ్చి యిస్తున్న రామసుబ్బు మొహంలో సిగ్గుతోకూడిన నవ్వూ, వినయమూతప్పించి మరేభావమూ లేదు!

ఆరోగ్యమైన శరీరం ఆహారాన్ని ఎంతసహజంగా మధురంగా కోరుతుందో, ఆరోగ్యమైన మనసు అంత ఆతృతతోనూ జ్ఞానాన్ని కోరుతుంది. భోజనశాలకు వెళ్ళడం ఎంత ప్రియమో, అంతకన్న ఎన్నోరెట్లు సహజం, సుందరం, కావాలి బడికి వెళ్ళడమనేది. బడీ, పంతులూ, అంటే ఇంత ఘోరమైపోవడం, బిడ్డ తప్పు ఏమాత్రమూ లేదు! ఎప్పుడు బడికి వెడతానా, అనే ఆతృత బిడ్డ కనపరచక పోతే, ఆ బడి విషమన్నమాట ఆ బిడ్డకి.

— చలం

(విద్య-బిడ్డల శిక్షణ)

టీవి సుబ్బారావు కవితలు రెండు

# చల్లని చీకటి

చీకట్లో మెట్లకింద
ముసుగు చీల్చుకొని
మండూక మృదంగం
కీచురాయి సన్నాయి.
చీకట్లో
వాన చినుకు కరిగి పోతున్నది
గాలి విసురు విరిగి పోతున్నది
చీకట్లో చినుకు విరిగి
చీకటే అవుతోంది.
చీకటి తడుస్తోంది.
గుండె పీకుతూ
ఉండీ ఉండీ
కుక్క బొంయ్యిన
గాలి రంయిన.
చీకటి మెట్లు
మెట్టుకీ పాకు తున్నది.
నా వెన్నుపూస మెట్టు మెట్టుకీ,
పత్తుగా, జీరాడే నల్లనికురుల్లా
నడుం విరిగిన ఉరగంలా
పాకు తున్నది.
పగటినీ
మగటిమినీ
చప్పరిస్తున్నది.

చీకటి అందం చూచి
లోకం బారలు చాపింది.
తడివస్తువు ప్రతిదీ మెరస్తుంది.
ఎండితే తప్ప.
ఆ చినుకు చీకట్లో విరిగి
చీకటి మెరిసింది.
ఆ మెరుపులో దేవతలొచ్చి
చుక్కల్ని పిల్చుకు పోయారు.

## సెలవుల్లో మావూరు

ఇక్కడ మరో నేల
మరో ఆకాశం!
ఆకాశం మబ్బుగా,
ఆకాశమేలేని ఒకే మబ్బుగా,
మన్ను దిన్న పెంజేరిలా
చిరాగ్గా సాగుతుంది.
మట్టిలో ఇలాస్టిసిటీ లేదు.
ఇహ నేను పొద్దస్తమానం
పుస్తకాల తలపాగా చుట్టుకొని
కొండచిలువలా పడుంటాను.
దేన్నీ జీర్ణించుకోలేను
అంతా పోగేసుకోవాలని మాత్రం ఆత్రం
కొండంతాశతో వస్తాను
ఎండిన గుండెతో తిరిగి వెళ్తాను
ఊర్నిండా బొక్క బెరుళ్ళు పూచి
చిన్నోళ్ళకీ, పెద్దోళ్ళకీ మనసుచుట్టూ మచ్చలు.
మా వూరు
నేటికీ నిలిచిన విక్టోరియానాటి కాసు
చివర్లు చిరిగిన అట్లాసు.

# అసూర్యం పశ్య

మానేపల్లి సత్యనారాయణ

కిటికీ ఊచల్లోంచి మనుష్యులు నడుస్తున్నారు
రిక్షాలు, సైకిళ్ళు, ఆడవాళ్ళు–కార్లు, గుర్రబ్బగ్గీలు
దూరంగా, చాలా దూరంగా పొగవదల్తూ
జెర్రిగొడ్డు చెట్లమధ్యనించి కోసుకు పోతోంది
యెవరో యెందుకో ఆకాశవాణిలాగ
చెవిలో సంగీతం వాయిస్తున్నారు
వీణ? – హార్మోనీ? – వయొలిన్? – క్లారినెట్?
బుల్ బుల్ కాదూ పీకుతున్నది? కాదుకాదు–మృ
దంగం– కిటికీలో కుళాయికింద బిందెలు
పలకరించుకుంటున్నాయి (కొన్ని దెబ్బలాడుకుంటున్నాయి)
మూతిలేని నీరు రోడ్డుని తడుపుతోంది
యింకోపక్క వున్న కిటికీ ఊచలు
పూలుపూస్తున్నాయి–అవి తుమ్మెదలకోసం
నాకు తెలిసినప్పణ్ణించి ఎదురుచూస్తున్నాయి
కిటికీ పువ్వులోంచి చుక్కలు చమక్కుమంటున్నాయి
చీకటి పడింది గావును. స్విచ్చి వెలిగించిన
ఎలెక్ట్రిక్ కాంతి గుండెల్లోకి (కుడి జఠరికా–
ఎడమ జఠరికా?) చొర లేదు.
పొడుస్తున్న నక్షత్రాల్ని తెంపి
సంతోష సూర్యుణ్ణి నిలపగలిగితే–
ఎంత బావుణ్ణెంత బావుణ్ణు ..
(నార్వ్స్–ఏదీ దారం–కుట్లు తెగిపోయాయి?)

# సముద్రం నిద్రపోతోంది

మురళీధర్

సముద్రం నిద్రపోతోంది
సముద్రం ఒడిలో ఒరిగి నగరం
నిశ్చలంగా పసికూనలా నిద్రపోతోంది–
దోచుకునేవాళ్ళను దోచుకోకుండా
వళ్లు దాచుకోకుండా
చీమల్లా సాగిపోయేవాళ్ళను రోజూ చూస్తూనేవుంది–

ఏమీ పట్టించుకో (లే)ని సంసారిలాగ
నిర్దాక్షిణ్యంగా
మూలగలేక మూలగలేక ఊరుకుంది–

విచ్చుకుపోయే మబ్బుల్లాగ
ఎండకి కరగిపోయే మంచుకణాల్లాగ
వెలుగు రేకులు పల్లవిస్తే
ఆకుమీదనుంచి సిగ్గుతో జారిపోయి
మట్టిని కౌగలించుకునే మంచుబిందువులాగ
నగరం నవ్వింది
తననుచూసి తాను నవ్వుకుంది!

మళ్ళా తెల్లవారిందని తెలిసిన మనుషులు
చీకటిలా మెరసే ఆకటికొండను
పిండిచెయ్యటం కోసం
చిక్కటి చీకటిని వంటినిండా అల్లుకుని
పరుగెడుతున్నారు–

అలుపులేని
పరుగెత్తని సముద్రం
బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంది—

నగరం నడినెత్తిపైకి
మిట్ట మధ్యానం వచ్చింది
టిఫిన్ కారియరూ, ఫ్లాస్కులూ, లంచ్ బాక్సులూ,
తమనితాము ఆత్రంగా ఖాళీచేసుకున్నాయ్—
తనకేమీ తెలియనట్లుగా ఊరుకుంది సముద్రం

మెతుకైనా గతకనివాళ్ళకే
మతిచెడ్డవాళ్ళకే
మజాతలపుల్ని యివ్వకుండా
మరీ 'ప్రోజయిక్' గా ఊరుకుంది।

గంటకెన్నో గంటల చొప్పున
నురగలు గ్రక్కుతూ
తెగబోతూన్న 'స్ప్రింగ్' లాగ
పళ్ళచక్రాలు సాఫీగా తిరగటానికి
తిరిగే 'బాల్ బేరింగు' ల్లాగ
బటన్ నొక్కితే బయటకువచ్చే వస్తువుల్లాగ

ఎక్కు పెట్టని ధనస్సుల్లాగ
ఎవ్వరికీ తగలని శరాల్లాగ
గేట్లల్లోంచి వచ్చేస్తున్నారు
ఎడారి యిసుకలో
కూరుకుపోయిన వాళ్ళల్లా నడుస్తున్నారు—

పిసినిగొట్టులాగ
బూటకంగా చూసింది సముద్రం

సానుభూతేగాని
ఖ్యాతిని సమాజపరం చెయ్యని ఘనమైన పురుగులాగ
ఏమీ యియ్యకుండా
అన్నీ తనలోనే దాచుకుంది—

చిరుచీకట్లు కమ్ముతూంటే
జంటలు జంటలుగా
మల్లెపూలని తలలో హత్యచేసి
గులాబీల ప్రాణం తీసి
(ముచ్చటగా)
నవ్వుల్ని, కెరటాలపై నురగలతో కలిపేస్తూ
వెంటాడే కెరటాల్ని నిర్లక్ష్యంగా దాటుతూ
వెన్నెల కిరణాలకి వింతగా మెరసే యిసుకను
విలాసంగా తన్నుతూ,
మత్తెక్కి తూలుతూ, సోలుతూంటే
(వాళ్ళకోసం) విధిగా కాపలా కాస్తూన్న చంద్రుడూ
ముచ్చట పడుతూన్న కెరటాలూ
ఆనందంతో
ఘోషిస్తున్నాయి:

రాత్రికోసం
చల్లారని ఆకలికోసం
దాహం తీర్చటంకోసం (?)
'చీప్ కాస్మటిక్స్' ముఖాన మెత్తుకొని
అయిదు నిముషాల్లో
ఇరవై యేళ్ళ యవ్వనాన్ని అమ్మేసి
కనీసకోర్కెల అగ్నిలో శలభంగామాడి
మసిబొగ్గులా మెరుస్తూ
నీరసానికి సరసాన్ని జోడించి
ఆక్రందానికి ఆహ్లాదంలాంటిది మేళవించి
చపక సారామైకంలో పడ్డవాళ్ళలాగ

ఎడారిలాంటి
ఇసుక తిన్నెలో తిరిగే స్త్రీ ఆకారాలనుచూస్తూ
ఘోషించటమేగాని
చల్లగా మాట్లాడటం చేతగాని కెరటాలుచూస్తూ
ఊరుకున్నాయ్—

అత్తెసరు బ్రతుకులో మ్రగ్గుతూ
'చీప్ ఎంటర్‌టైన్‌మెంట్' లాగ
పావలాకుదొరికే కల్లుముంతలాగ
కిక్కురు మనకుండా
బిక్కు బిక్కు మంటూ
మరో ఆకారంతో
అలవాటుగా, బద్ధకంగా రమిస్తే
తప్పని చిక్కులోంచి వాడిపోయిన యిల్లాల్నిచూసి
సిగ్గులేకుండా ఊరుకుంది సముద్రం—
నగరంపైన పాములా అల్లుకుపోయింది చీకటి—

సముద్రానికి
అందం, ఆనందం, స్నేహం, అన్నీ దాచుకునే
యుక్తి ఉంది.
బాధతో కుమిలే నగరాన్ని
తనలో నిద్ర పుచ్చుకునే శక్తి ఉంది.

## లే, లేకుంటే, చావు!

టంకశాల అశోక్

తినడానికి తిండిలేక,
కట్టడానికి బట్టలేక
ఉండడానికి ఇల్లులేక
మనసుకలసిన భార్యలేక
మమతపంచే బిడ్డలేక
అవసరాలకు డబ్బులేక
అనుభవించే హక్కులేక
ఉన్నవారిని చూస్తూ
దేబరిస్తూ
కృంగిపోతూ
అసూయపడ్తూ
నిరాశ చెందుతూ
సగం చస్తూ
ఉడికిపోతూ
నలిగి పోతూ
ఏడ్చుకుంటూ
తిట్టుకుంటూ
తీసుకు తీసుకు చావు
చావు! చావు!! చావు!!!
పచ్చనైన చెట్టు వుందీ
విస్తరించిన కొమ్మలున్నై

అందమైన పువ్వులున్నై
కండబట్టిన పళ్ళున్నై
మొలుచుకొచ్చే చిగురుఉంది
పనికివచ్చే కర్ర ఉంది
నీడ గలిగిన చోటు ఉంది.
చేతనైతే
గుండెలుంటే
బ్రతుకుతాను
అనుభవిస్తా
అనే ధైర్యం
చీము ఉంటే
ఆశ ఉంటే
ఆవేశముంటే
లేచి నిలబడు
ఋతువు సంపద
దులుపుకో
పంచియివ్వ
అనుభవించు,

ఇలా కూడా రాకపోతే
బ్రతుకు మార్గం తెలియకుంటే
బ్రతకలేనను పిరికి ఉంటే
బ్రతుకు తాహతు లేకపోతే,
చావు,

# 'వేయి చిగుళ్ళు... వేయి,

కిషన్

పోదాం పదర పోరగ!
నీళ్ళు నాకినట్లు ఎంతకని ఈ బ్రతుకు?–
పోదాం పదర పద!

ఊరొదల లేనంటు పూరికే వగచకు
చిగురువేసిన చింత 'సై' మరిగి కరగకు;
తోటి మానవులంటు నమ్మి కాపురముంటె–
దక్కింది మనకింక చింతలే కాదురా!!

ఆటగోగిలితనం వదలరా! కదలరా–
ఒంటిబ్రతుకెట్లంటు పోరలను తలుపకు,
మనిషి కలసిననాడె మత్సరం పెరిగింది.
కొత్త కుక్కనుజూసి మనకొండాలు మొరగదుర!

ఒక్కరుగ మనముంటె దక్కనివ్వరు అనకు.
–ఏపిట్ట తనకొరకు నిలువలుంచిందిర?
అడవిలో పులులంటు ఛడుసుకుంటావటర!?
కపటమెరగని పులులు గొప్పరా–మనకన్న.

పిరికిపడి ఊరొదల పాడిగాదనకు
ఈ ఊరు వద్దింక! చచ్చు బొద్దెంక!
ఎంతకని మేద్దురా ఈ "మనుషు"?! లను జూసి,
నా బంగారు మొలకవి! నిన్ను కల్తిగానీయర!

ఒక ఊపిరా? ఉత్తేజమా?—
స్వంతమేముందిరా? ఈ సంతగుంపులకు।
సాహసం పేరువిని రిచ్చపడి జూస్తారు।
తిరుగుబాటేదిరా? అణగారిపోతున్నా.

ఎవ్వడేడ్చారురా? గువ్వ చనిపోతే?।
ఎవ్వరడిగారురా? నక్కా, నువ్వువస్తానీ?
మనం ఎదిగేమి ఫలమురా? ఎర్రినాగన్న.
సమంగా స్వార్థమూ ఎదిగింది గదరా।

ఒకడు దోచేస్తాడు - ఒకడు దాచేస్తాడు।
ఒకడు బెదిరిస్తాడు ఒకడు ఎగదోస్తాడు.
రంగానికొకడుగా రంగేళిచేయగా
తోలుబొమ్మల బ్రతుకులేలరామనకు?

సంఘజీవిగ మనిషి సంతరించిన తీరు—
ఒకరికొకరుగతోడు ఉండుటే గదరా?
తారుమారై మనిషి తన బలిమికొరకు
తింటూన్నదేందిరా? మనిషినేగాక।

ఎవ్వడో భీషుడిటువచ్చు పర్యంతం
చావమనిచెప్పేదె మనకు సిద్ధాంతం!
తిరగబడి చావమని చెప్పినోడేడిరా—
ఇంకొక్కదినమైన ఈచావు బ్రతుకుంటె—
'ఆమె' బాహుమూలాలలో తలదూర్చి 'దేవు' మని ఏడ్చుటే—!
నిముష నిముషం చచ్చి, నిముష నిముషం ఏడ్చి
తెల్లారి మళ్ళి చనిపోవుటే—కాదురా?
అందుకే ఒద్దురా। పోరగా, వినరా.
సాహసంపేరువిని అపచార మంటారు.
చేతనం పేరువిని విద్రోహ మంటారు
ఆత్మవంచనగాళ్ళు। అర్తులు। వ్యర్థులు.

చూడు దిక్కులనిండి ధవళతేజస్సు।
ఉడుకునెత్తురుపడే సంపాతధ్వనులు—
పద సన్న ఈ పిరికిపందలకు ఎడంగా
మలుస్తా మనిషిలా। నవవిప్లవంగా।
అగ్నివై అంటించు ఈ నరతరూతతిని,
ప్రతి ఒకడు ఎర్రగా కొత్తనెత్తురుతో
ప్రతి ఒకడు ఎర్రగా అంగార జ్వాలల్లా
ప్రతి ఒకడు మనిషిలా సహజతేజంతో—
—జీవించు నవ్యవేదం పఠించంగ
పదరా—పోదాం। పదరా।
ఎన్నాళ్ళు నీళ్ళు నాకినట్టిబ్రతుకు?
ప్రొద్దువాలకముందె పొందాలె ధ్యేయాన్ని
పద పద పద।

# క్లైమాక్స్

పరిగి రాధాకృష్ణ

ఈ కథ యిక్కడ ఆగదు
ఆగే అవకాశం అతిస్వల్పం
సినిమాకథలా యిది నారలా సాగుతుంది
ఇంకా కొన్ని కన్నీళ్ళు కురుస్తాయి
ఇంకా కొన్ని మనసులు కుళ్ళి కృశిస్తాయి
అప్పుడుగాని కథకి క్లైమాక్స్ రాదు
క్లైమాక్స్‌లేని కథకి అందం లేదు
ఆ పతాక సన్నివేశానికింకా గడువుంది
అందాకా అందరి ఆటలూ సాగుతాయి
కప్పదాట్లతో కాలం వెళ్ళబుచ్చే సావకాశముంది
కుంటిసాకులుచెప్పి కర్తవ్యాన్ని
వాయిదా వేయడానికి అవకాశముంది
పట్టుబడిపోతామనే బెంగ
ఎవరూ పెట్టుకోనక్కర లేదు
అన్యాయం చేస్తున్నామేమోననే అనుమానం వద్దు
అన్యాయాలు చేయంది అబద్ధాలు చెప్పంది
ఆడంబరంగా జీవించడం అయ్యేపనికాదు
పట్టుబడినప్పటి సంగతి
పరమాత్ముడే చూసుకుంటాడు।

పశ్చాత్తాప మెలాగూ పిలిస్తే పలుకుతుంది
నీతిచంద్రిక జ్ఞాపకమూ వస్తుంది
వేదాంతం ఓదార్చడానికి తయారుగా వుంటుంది
ఆ పతాక సన్నివేశంలో యిక ప్రశ్నలుండవు
గింజుకోవడమూ జుట్టు పీక్కోవడమూ వుండదు
అప్పుడు కన్నీళ్ళు రాకపోవచ్చు
మాటలు నోట్లోనే వుండిపోవచ్చు
పరిస్థితులు పురిలా పేనుకుంటాయి
నిజంమీద నివురు తొలగిపోతుంది
అందాకా అందరి ఆటలూ సాగుతాయి
అందాకా ఈ కథ నడుస్తుంది.

# రా, అన్నారా!

కె. శివారెడ్డి

ఆకాశపు రోడ్డు కడ్డంగా
పడిపోయిన చెట్ల మాటేమిటి?
చంద్రుని వెన్నెల్లో సగం సగం
తడిసిపోయినమెట్ల మాటేమిటి?

నీబొడ్డులో చేయివేసి
నాజేబులో శయనిస్తున్న
జ్ఞానాని కర్థమేమిటి?
మానానికి అర్థమేముంది–

అవును నేనలా మానస సరోవరంలోకి తొంగిచూసినపుడు
మానవపరిణామ కెరటం గుండె ఒడ్డుల్ని తాకినపుడు
అలవాటుపడిన నాముఖం నన్నెవెక్కిరించింది
అంతకంతకు పెరిగిపోతున్న నాగరికత కుక్కమూతి సందెవేసింది.

గతపు 'ఖజానాని' దాని 'అమ్మ' ముఖాన పాతేసి
'అర్ధరాత్రి మంచం' మీద
'ఆరోజులాడె'ని సేవించాను
దాని మాలిన్యపు టాసవాన్ని
నానరాల సీసాల్లోకి వడకట్టాను
నా పళ్ళంతా పుతికి ఇప్పుడు
ముళ్ళమీద ఆరేసు కుంటున్నాను.

ఇంత బ్రతుకు బ్రతికి ఉన్నదంతా నమ్ముకుని
జారిపోయినదాని యౌవన సామ్రాజ్యపు సింహాసన మెక్కటానికా?
పగిలిపోయినదాని పాతివ్రత్యపు గాజుపెంకుల్ని గుండెల్లో దింపుకోవటానికా?
దాని శరీరపు హంసతూలికా తల్పంలో ఏం మిగిలింది?
దాని కామంలోని కొవ్వుని వత్తులుగా వెలిగించింతర్వాత ఏం మిగిలింది?
ముద్దగట్టిన బూజుగ దూదితప్ప–
గడ్డకట్టుకున్న చీకటి అద్దంతప్ప–

ఇప్పటికే ఆ కిటికీ ప్రక్కలోనే
అడుగుల సవ్వడులకు గాలంవేస్తూ
పగిలిన బీరువా అద్దంలో
పడిపోయిన యౌవనపు 'లిప్‌స్టిక్' పెదాలకు రాస్తూ,
రసికతని తమలపాకుల మీదపూస్తూ.
బ్యాటరలయిపోయిన టార్చిలైట్‌లా,
గుడ్డిదీపాలవెలుగులా, కనుగుడ్ల బుడ్లవెలిగించి,
ఆతని హృదయపుటెడారిలో
బ్రాంతీ ఒయాసెస్ కల్పించి

స్వరాజ్యపు ప్రజాస్వామ్యపు కప్పుకింద
ఇప్పటికే 'పక్క'నే పళ్ళెంగా తిరుపమెత్తుతుంది.
ఆ ఆకాశపురోడ్డు కడ్డంగా
అయితికాని ఆబోతుల దండేమిటి?
పూంభిందెల్ని ఏరుకు తింటున్న
ఈపోతుల మూకేమిటి?

ఏముంది ఎక్కడికక్కడ పుట్ట పెరిగే
చీకటి చెట్లకు పహరాకాసే ప్రజాస్వామ్య
పరిపాలనా దురంధరుల దుంధుభిధ్వానాలు
అక్కడికక్కడే దీపాలనార్పేసి పాపాలకుపాలు
పోసి, స్వార్జనా పట్టుపురుగులపెంచే సమూహాలు.

రా పమ్మా రా! రా అన్నయ్యా రా!
ఈ యింటిలో నీకెప్పుడూ యింతచోటు వుంటుంది
ఈ యిరుకుంపటిలో పెరిగే పూలలోనీవూ ఒక్కడవే-
ఆ సిరులకురులలో నీకెప్పుడూ చోటుండదు—

నా పరసకురా! నాతో చేయికలుపు
ఈ సరసులోనిన్నూ ఒక్కకలువ మొగ్గనిచేస్తా.
ఈ తమసుతాపసికి తపోభంగం చేద్దాం
ఈ త్రపాభరన్యాయావృత ముగ్ధకు
రేపో, మాపో, పరిణయించేద్దాం
ఎవరికివారే 'మేకప్' చేసుకునేందుకు
మనననే ముకురం, విమర్శనే దువ్వెన
'పొరుగుపచ్చ' అనే పౌడరు యిద్దాం—
ఇంత చేసింతర్వాత ఏడుపుముఖంతో
ఎవడు నిలబడతాడో చూద్దాం—రా, అన్నారా,
రా అన్నారా, నాతో రా,

ఆ వరాహావతారం,
ఆ కూర్మపు బ్రతుకు నీకొద్దు
నిన్ను భంభరం చేస్తాను
ఈ విశ్వంభర నొక్కసారి వూపుదాం
రా, అన్నారా!

## ఇంకో గంగావతరణం

—ఒక బోర్డర్

(ఉస్మానియా యునివర్సిటీ డి హాస్టల్‌లో ఏప్రిల్ నెలలో నోటీస్ బోర్డ్‌పై ఈ కవిత చదివాను. ఇది ఆ హాస్టల్‌లోని విద్యార్థుల / అందరి ఆందోళనగా నా కనిపించింది. ఆ బోర్డర్ ఎవ్వరో ఇప్పటికీ నాకు తెలియదు. ఇట్లా అనుమతిలేకుండా ప్రచురిస్తున్నందుకు ఆయన నన్ను మన్నిస్తాడనే భావిస్తాను. సం॥)

భగీరథుడు తపస్సు చేసాడో లేదో
భువిపై గంగ పారాలని
మేం మాత్రం తపస్సు చేసాం
కుళాయిల్లో నీళ్ళు రావాలని
మునుల్లా కూర్చున్నాము
ముక్కు మూసుకొని ఆలోచించాం
తల తాటించాము, నిట్టూర్పులువిడిచాం
ఏదో ఆ పాతాళగంగ (Tap Water)
ఆకాశగంగ అక్కర రాకుండా ఎటోపోయింది
మేమేమో ఆలోచించాం
తలకాయలు చించుకొన్నాం
రాని నీళ్ళకొరకు
నీళ్ళులేని కుళ్లాయిలవద్ద
మా పండ్లపై పాచీ పెరిగిపోయింది
ఆదుర్గంధంతో లోకం నిండిపోయింది
మా గడ్డాలు పెరిగి ఉన్నాయి
భగీరథుల్లా మా ముఖాలు తోస్తున్నాయి.

నిద్రమబ్బు వదిలిందిలేదు
నీరసంగా చదివిందిలేదు
ఆత్మారాముడు అల్లరిచేస్తున్నాడు
ప్రక్షాళనంలేని ముఖాలు అఘోరిస్తున్నాయి.
బెడ్ కాఫీ తాగుదామనుకొన్నాను
వాసన ఘప్‌మని కొట్టింది
ఏంచేయాలో తోచిందిలేదు
తలపై మొట్టికాయ కొట్టుకున్నాను.
జుట్టు పీక్కున్నాను
దేవదాసులా నటించాను
బ్రాండోలా గలగలానవ్వాను
కాని యేం లాభం
పెద్దలు పట్టించుకోమంటారు
వాటర్ సప్లయివాళ్ళు నిద్రపోతుంటారు
మేం కూడ నిద్రపోవాల్సిందే
ముక్కు మూయాల్సిందే
తపస్సు చేయాల్సిందే
ఇంకో గంగావతరణం కోసం
ఇలాగే భగీరథుల్లా.

చర్చావేదిక:

# భాష—ఒక శాస్త్రీయదృక్పథం

చేకూరి రామారావు

భాషేతర ప్రపంచానికి భాషకూగల సంబంధం సాంకేతికం:

అంటే భాషకూ అది సూచించదల్చుకున్న వస్తు, భావ సంచయానికి జన్య జనక సంబంధంగాని, మరేవిధమైన ప్రత్యక్ష సంబంధంగాని లేదు. భాషాపదాలు కేవల సంకేతాలు. 'పిల్లి' అనే మాటకూ అది సూచించే జంతువుకూ ఎట్లాంటి ప్రత్యక్ష సంబంధమూలేదు. 'పిల్లి' అనేమాట కేవలం సంకేతం. ఈ సంకేతం ఈ భాషా వ్యవహర్తలకు ఇష్టంలేకపోతే ఏ మార్జాలమో బిడాలమో సంకేతాలుగా పెట్టుకోవచ్చు. అందువల్ల భాషావ్యవహారానికి వచ్చిన ఇబ్బంది ఏమీలేదు. మాటకీ-అర్థానికీ విడదీయరాని సంబంధంలేదు. మాటలు మనుషులు కల్పించుకొన్నవి. వాటి అర్థాలూ మనుషులు ఏర్పర్చుకొన్నవే. మాటకీ అర్థానికీ విడదీయరాని సంబంధమేవుంటే భిన్నార్థకాలైన మాటలు ఏకార్థకాలు కావటం, ఏకార్థకాలైన పదాలు భిన్నార్థకాలు కావటం ఉండదు. సంకోచవ్యాకోచాది అర్థ విపరిణామానికి అవకాశమే వుండేదికాదు. ఒక వస్తువునుగాని సంఘటననుగాని మరోవస్తువుకో, సంఘటనకో ప్రతీకగా పెట్టుకునే శక్తి మానవజాతికి మాత్రమేవుంది, జంతువులకు లేదు.

భాషకూ—అది సూచించే ప్రపంచానికీ సారూప్య సంబంధం లేదు:

ఇది పై ప్రతిపాదనలోనే ఇమిడివుంది. స్పష్టతకోసం మాత్రమే ఇక్కడ వేరుగా చెప్పటం. ఉదాహరణకి ఆంధ్రదేశ పటం ఆంధ్రదేశానికి సంకేతం. కాని ఈ రెంటికీ సారూప్య సంబంధం (iconicity) కూడావుంది. జంతువులబాధ తీవ్రతకూ, అవిచేసే అరుపుల దైర్ఘ్యానికీ అట్లాంటి సంబంధం వుంది. కాని భాషలో అత్యంత తీవ్రభావాన్ని చిన్నవాక్యాల్లోను, తేలికభావాన్ని పెద్దవాక్యాల్లోనూ చెప్పవచ్చు. అవతలివాళ్ళ హృదయాల్లో గుచ్చుకునే పదునైన అర్థంగలమాటల్ని ఏ వికారమూ లేకుండా ఉచ్చరించి ఉద్దిష్టలక్ష్యాన్ని సాధించవచ్చు.

సాహిత్యవిమర్శలో ఇట్లాంటి సరూపసంబంధ నిరూపణ ప్రయత్నాలున్నై. జగణాల ప్రాచుర్యం, మహాప్రాణధ్వనుల ఆవృత్తి వీరాది రసస్ఫోరకాలనీ, అనులోమ గణాలవాదకం, అను నాసికధ్వనుల ఆవృత్తి శృంగారాది రసస్ఫోరకాలని మన సాహిత్య విమర్శకుల అభిప్రాయం. కాని అక్కడైనా అవి మనం ఏర్పర్చుకున్న సంప్రదాయాలేకాని ప్రత్యక్ష సంబంధజనితాలుకావని నా అభిప్రాయం.

భాష సంప్రదాయ విహితం:

ఒకతరం మరోతరానికి సంస్కృతీ సంప్రదాయాల్నందిస్తుంది. భాషకూడా అట్లా అందించబడిందే. విభిన్న సంప్రదాయాలున్నట్లే భిన్నభాషలూవున్నై. సంప్రదాయాన్ని నేర్చుకున్నట్లే భాషనూ నేర్చుకుంటాం. అంటే భాష దైవదత్తమూకాదు, ప్రకృతి దత్తమూకాదు, అభ్యస్తం మాత్రమే. ఒక పిల్లవాణ్ణి నిర్జనప్రాంతాల్లో పెంచితే మాట్లాడలేడు. జంతువు అరవగలుగుతుంది. తెలుగు పిల్లవాణ్ణి అరవవాళ్ళు పెంచితే అరవమే మాట్లాడతాడు. ఒకజాతి జంతువును వేరొకచోట పెంచినా తనజాతి జంతువులాగే అరుస్తుంది.

భాషకు దేశకాలాతీత విషయ బోధకశక్తి వుంది:

విజయనగర సామ్రాజ్య వైభవాన్ని గురించిగాని వచ్చే శతాబ్దంలో తెలుగు దేశంలో రాబోయే రాజకీయ పరిణామాల్ని గురించిగాని భాషలో మాట్లాడుకోగలం. హైదరాబాదులో అసెంబ్లీ విశేషాలుగాని, వియత్నాం యుద్ధపరిణామాల్ని గురించిగాని భాషలో మాట్లాడుకోవచ్చు. అంటే వెనక్కి తిరిగిచూసుకోటానికిగాని, ముందుచూపుకి గాని, ఇక్కడి సంగతుల్ని గురించిగాని దూరదేశ విషయాల్నిగురించిగాని చర్చించటానికి భాష అవకాశాన్ని కల్పిస్తున్నది. ప్రాచీన చరిత్రావగాహనకూ, శాస్త్ర పరిశోధనకూ (ముందుచూపువల్ల,) విజ్ఞానవ్యాప్తికి ఈ లక్షణం ఎంతో ఉపయోగకారి. జంతువుల అరుపులకు ఈ శక్తి లేదు.

భాషలో చెప్పగల విషయాలకు, వాక్యాల దీర్ఘతకూ, సంఖ్యకూ పరిమితి లేదు:

మానవుల భిన్నానుభూతుల్ని భాష వ్యక్తీకరించగలదు. మానవుడి అనుభవాల సంఖ్య ఇంత అని ఎవరూ చెప్పలేరు. అంతేకాదు ఆ అనుభవా లిట్లాగే ఉంటయ్యని కూడా నిర్దేశించలేరు. ఆ అనుభవాల కెట్లా పరిమితిలేదో భాషకూ పరిమితిలేదు. శాస్త్రజ్ఞుల పరిశోధనలన్నీ నూతనానుభవాలేకదా. వాటి నన్నిట్నీ చెప్పాల్సింది భాషలోనే. అసంఖ్యాకమైన నిత్య నూతనానుభవాల్ని భాష వ్యక్తీకరించగలదన్నమాట

భాషలో ఒక వాక్యం చూపించి ఇంతకన్న పెద్ద వాక్యం వుంటానికి వీల్లేదనటానికి వీల్లేదు. పెద్దవాక్యాన్ని అంతకన్న పెద్దవాక్యం చెయ్యవచ్చు. భాషలో వాక్యాలసంఖ్య కూడా ఇంత అని చెప్పలేము. అంటే అనంతమన్నమాట. ఈ లక్షణం సాహిత్య సృష్టికి దోహదకారి. ఒక కవిరాసిన కావ్యం పూర్వ కవికావ్యంకన్నా ఏదోరకంగా భిన్నంగానే వుంటుంది. జంతువులు కొన్నిరకాల అరుపుల్ని మాత్రమే చేయగలవు. మిగతావి వాటి పునరావృత్తే.

భాషలో కల్పనలు చెయ్యవచ్చు:

ఒక రాజకీయవాది ఎదుటిపక్షంవాడు దేశద్రోహి అని అబద్ధాలు ప్రచారం చెయ్యవచ్చు. ఒక కాలేజి అబ్బాయి అమ్మాయిలమీద పుకార్లు పుట్టించవచ్చు. అవాస్త వాలయిన విషయాలను భాషలో చెప్పవచ్చు. ఈ లక్షణం మానవులకు అపకారికాదాఅని ప్రశ్నించవచ్చు. సాహిత్యంలో కల్పనలకు ఈ భాషాలక్షణమే ఆధారభూతం. 'ఎఱ్ఱ శాలువ కప్పుకొని మా ఇంటికొచ్చిందొక రివాల్వరు' అన్న కల్పనకు భాషలో ఈ లక్షణమే వీలు కల్పిస్తుంది. అంతేకాదు. "కాకికేమితెలుసు సైకోఎనాలిసిస్, ఆటవెలది ద్విపదకర్తగారు" అన్న అర్థరహిత వాక్యానికి ఈ లక్షణమే మూలం. కల్పన అర్థ వంతమూకావచ్చు, అర్థరహితమూకావచ్చు. జంతువుల అరుపులతో ఇది సాధ్యంకాదు.

భాషలో ద్వైధీ నిర్మాణం (duality of patterning) ఉంది:

భాషలో రెండురకాల ద్రవ్యాలున్నై. ఒకరకం ద్రవ్యాలు అర్థభేదక సమర్థమైనవి, రెండోరకం అర్థబోధక సమర్థమైనవి. మొదటివాటిని వర్ణాలనీ (Phonemes) రెండోవాటిని శబ్దాలని (Morphemes) అంటారు. వర్ణసంయోజన, వర్ణప్రవర్త నాదుల్ని వర్ణ శాస్త్రం (Phonology ) అనీ, శబ్దనిర్మాణాదుల్ని శబ్ద శాస్త్రం (Morphology ) అనీ. అంటారు. ఈ రకమైన నిర్మాణం జంతువుల అరుపుల్లో లేదు. అంటే అవి అర్థబోధక సమర్థమైనవాటితో కూడినవే. ఈ రెండురకాల నిర్మాణాలవల్ల. పరిమిత సంఖ్యగల 'అర్థ భేదక సమర్థమైన ద్రవ్యాల' సంయోజనవల్ల (వర్ణసంయోజనవల్ల) అధిక సంఖ్యాకమైన అర్థబోధక ద్రవ్యా లేర్పడతై, ద్వైధీనిర్మాణంలేక పోవటంవల్ల జంతువుల ఆక్రందనలసంఖ్య అత్యల్పం.

భాషలో భాషనుగురించి చెప్పగలం:

దీనికి వేరే వివరణ అనవసరం, ఈ ప్రస్తుత వ్యాసమే అందుకు సాక్ష్యం.

ప్రాచీనాధునిక వ్యాకరణాలన్నీ ఇందుకు నిదర్శనాలు. ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంత చర్చలన్నీ ఇందుకు సాక్ష్యాలే. అరుపులలో ఆక్రందనలో, కేరింతలలో కేకలలో వాటిని గురించి చెప్పలేమన్నది స్పష్టమేగదా.

ఇటీవల దుర్గానంద్‌గారు 'మానవుని మూలభాషలు ఏవి?' అనే వ్యాసంలో మానవుల భాషలో మిగిలిపోయిన, భాషాలక్షణాలు సరిగా పట్టని, మానవులకు జంతువులకు సంధిప్రాయమైన ఆర్తి, రోదన, ఆక్రందన, గర్జన, అరుపులు మొదలైనవాటిని మానవుడి సరైన భాషలు, మూలభాషలు అని ఒక విచిత్రమైన సిద్ధాంతం ప్రతిపాదించారు. మానవపరిణామం–భాషా సంపాదన ఒకేసారి జరిగినయ్యని శాస్త్రజ్ఞుల ఊహ. (చూ–Hockett and Ascher "The Human Revolution" in Current Anthropology, June 1964).

"ఇంగ్లీషు అరబ్బీ ఫారసీలు మృతసామ్రాజ్య భాషలు" అని దుర్గానంద్‌గారు అదేవ్యాసంలో ప్రతిపాదించారు. ఈ సందర్భంలో — భాషకు వర్గస్వభావాన్నాపాదించిన సోవియట్ శాస్త్రవేత్త N. Y. Marr ని అవహేళనచేస్తూ స్టాలిన్, ప్రావ్దావిలేఖరికి చెప్పినమాట గుర్తుతెచ్చుకోవటం మంచిది. (స్టాలిన్ భాషాశాస్త్రవేత్త అనికాదు. రాజకీయ నాయకుడైన స్టాలిన్‌కుకూడా ఈవిషయం తెలుసుఅనిచెప్పటానికే)

"There used to be 'Marxists' in our country who assert that the railways left to us after the October Revolution were bourgeois railways, that it would be unseemly for us, Marxists, to utilize them, that they should be torn up and new, "Proletarion" railways be built. For this reason they were nicknamed "troglodytes".

"Only ignorance of Marxism and complete failure to understand the nature of language could have suggested to some of our comrades the fairy tale about the disintegration of society, 'class' languages and 'class' grammars."

Joseph stalin "Marxism and Linguistics"
International publishers, New york, 1951.

స్మృతి :

## నాకు తెలిసిన శ్రీవాత్సవ

ఆర్. విద్యాసాగర్‌రావు, న్యూ ఢిల్లీ

ఆనాడు ఉగాది– ఢిల్లీ ఆంధ్రులు, ఆంధ్ర సంఘం అధ్యక్షులు శ్రీ సూరి భగవంతంగారింట్లో ఏర్పాటుచేసిన ఉగాది ఉత్సవాలను కడువేడుకగా జరుపుకుంటున్న సమయం. పిడుగుపాటువలె శ్రీ వాత్సవగారు పోయారన్నవార్త మోసుక వచ్చిన వ్యక్తివైపు పిచ్చిగాచూసారు గుమికూడిన వాళ్ళందరూ – నిజమనితెలిసాక కొద్దిక్షణాలు శిలాప్రతిమలైపోయారు. శ్రీవాత్సవ కొద్దిరోజులుగా అస్వస్థతగా ఉన్నమాట వాస్తవమే అయినప్పటికీ ఇంత హఠాత్తుగా వారు వెళ్ళిపోతారని కలలో కూడా ఎవరూ ఊహించలేదు.

శ్రీ వాత్సవ ఒక మరపురాని వ్యక్తి – శ్రీవాత్సవతో పరిచయమయి ఇంకా మూడు సంవత్సరాలుకూడా నిండలేదు. ఈ కొద్దికాలంలోనే వారికి అత్యంత సన్నిహితుణ్ణయ్యాను. 1966 ఫిబ్రవరి, మార్చి ప్రాంతాల్లో Songs & Drama Division Festivals లో ఏదో నాటకం చూస్తున్నప్పుడు, Songs & Drama Division డిప్యూటీ డైరెక్టర్ శ్రీ పి ఎస్. రామారావు నన్ను శ్రీ వాత్సవగారికి పరిచయంచేశారు. అప్పటికి 'శ్రీ వాత్సవ' పేరు వినడమేకాని వారిని చూడలేదు, దక్షిణభారత నటీనట సమాఖ్య సభ్యుడిగానూ, నటుడిగానూ వారికి పరిచయం కావింపబడ్డాను. ఆరోజూ, ఆతరువాత కొద్దిరోజులూ, మేము ఆంధ్రదేశంలోని వివిధ నాటకసమాజాలు, క్రొత్తగా వస్తున్న నాటకాలు చర్చించాం. ఇప్పటికీ నా చెవుల్లో వారి మాటలు గింగుర్లెత్తుతున్నాయి. శ్రీ వాత్సవగారు బలివాడ కాంతారావుగారి 'అడివిమనిషి' నాటకం ప్రదర్శించమని ఎన్నోసార్లు చెప్పారు. ఎందుచేతనో బలివాడ కాంతారావుగారిని కథకుడిగాతప్ప నాటక రచయితగా ఊహించుకోలేక పోయాను. అందుకనే కామోసు వారి సలహాను అంత సీరియస్‌గా ఆలోచించలేదు.

(ఆతరువాత కొద్ది రోజుల్లోనే 'అడివిమనిషి' నాటకం హిందీలో అనువదింపబడి ప్రసారం కాబడింది). మాసమాఖ్యకోసమని ప్రత్యేకం ఒక నాటకం రాయమని కోరాను. వారు మామూలు నాటకాలకు భిన్నంగా ఒక డాక్యుమెంటరీ చిత్రం పద్ధతిలో ఉండేలాగు, ఒక ప్రయోగాత్మకమైన నాటకం, బస్తర్ మహారాజు హత్య ప్రధానంగా రాస్తున్నానని, వీలైతే ప్రదర్శించమని చెప్పారు. ఈ సలహాకూడా నాకంతగా రుచించకపోవడంవల్ల అలాగేవదిలేసాను. (వారి నాటకం పూర్తియ్యింటే, దాన్ని వెలుగులోకి తీసుకరావడం ఆంధ్ర నాటక సమాజాల బాధ్యతఅని గుర్తుచేయడం అవసరం.)

శ్రీ వాత్సవగారిలో ప్రిడామినెంట్ గుణాలు రెండు: మొదటిది, వారికి ఆంధ్ర అన్నా ఆంధ్రభాషఅన్నా అవ్యాజానురాగం. తెలుగు వాళ్ళ ఏ కార్యక్రమం అవనీండి, ఏ మారు మూల అవుతున్నప్పటికీవెళ్ళి పాల్గొంటుండేవారు. వారికి అనేక సభల్లో ఆంధ్రేతరులకు తెలుగుభాష అందచందాలను. నుడికారపు సౌందర్యాన్ని, మన కావ్యాల గొప్పతనాన్ని చాటిచెప్పటమంటే ముచ్చటగా ఉండేది.

రెండోగుణం, వారియందున్న శక్తికి మించిన ఉత్సాహం — దీనికో ఉదాహరణ ఆంధ్ర ప్రదేశ్ అవతరించి పది సంవత్సరాలు నిండిన సందర్భం పురస్కరించుకొని ఆంధ్రుల వడియాలు, అప్పడాలు, పచ్చళ్ళు మొదలైనవాటి ప్రదర్శనలు మొదలుకుని తెలుగువాళ్ళ సంస్కృతీ సాహిత్యాలకు, ప్రత్యేకమైన కళలకు, ప్రతిబింబంగా నిలచిన నాట్యాలు, తోలుబొమ్మలాటలు, కవిసమ్మేళనాలు, చిత్రకళాప్రదర్శనలు పద్యగద్య నాటకాలు ఏగైరాలను ఆంధ్రులలో పేరుపొందిన కళాకారుల రప్పించి, వారిచేత ప్రదర్శనలనిప్పించి కనీసం వారంరోజులపాటైనా 'ఆంధ్రోత్సవాలు' భారతరాజధాని నగరంలో వైభవంగాజరిపి ఆంధ్రుల ప్రతిభను ఆంధ్రేతరులకు చూపాలన్న వారి తహతహ ఆశయం నిజంగా అభినందించతగ్గదే — ఈ విషయంవారు నాతో చర్చించినప్పుడు ఈ ఆలోచనలన్నీ ఆచరణలోనికి రావడానికి ఎన్నిరోజులు ఎందరిశ్రమ ఎంత డబ్బు అవసరమవుతుందో అంచనావేసి చూపాను. ఐనా వారు నిరుత్సాహపడకుండా ఆఖరుక్షణంవరకూ ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం సహాయాన్నర్థిస్తూ ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూండేవారు. వారి బృహత్తరమైన యీ ప్రణాళిక ఏనాడైనా రూపొందిన పక్షంలో ఆ ఘనత ఆయనకే చెందాలి. శ్రీ వాత్సవగారు గురజాడ జయంతి చాలా పెద్ద ఎత్తున చెయ్యాలని సంకల్పించి, చేసిన ప్రయత్నాలన్నీ విఫలం కాగా చాలా చిన్న సభపెట్టి అంతటితో తృప్తిపడవలసొచ్చింది.

శ్రీ వాత్సవగారు 'షోడశి' అనే ఒక సాహిత్యసంస్థను లేవదీసి, సాహితీవరుల సహకారంతో దాన్ని పటిష్ఠంచేయాలని ఉవ్విళ్ళూరేవారు – 'షోడశి' ఆధ్వర్యాన ఒక్కసారి మాత్రమే సాహిత్యాభిమానులు కలుసుకోవడం తటస్థించింది. తెలుగు కవిత్వంలోని వివిధ దశలను చూపుతూ ఒక చక్కని ఉపన్యాసమిచ్చారు. ఐతే ఒక విషయం ఈ సందర్భంలో చెప్పటం చాలా అవసరం – వచన కవిత్వం గురించి వారు ఎక్కువగా తరచిచూచినట్టు నా కనిపించలేదు. ఈ విషయమై ప్రత్యేకంగా నేను వారికి చెప్పాల్సొచ్చింది. సాహిత్యానికి సంబంధించిన అన్ని ప్రక్రియలలోనేగాక నాట్యం, సంగీతం, చిత్రకళ మొదలైన ఇదితర కళలపై వారికి అభిరుచి, ఆసక్తి ఉండేది – చాలా విషయాలను వారు ఎంతోకష్టపడి క్షుణ్ణంగా తెలుసుకున్నారు— వారిలో పరిశోధనాసక్తి విరివిగా ఉండేది. రాజధానినగరంలో సమాఖ్యచేస్తున్న సేవను వారు ఎప్పుడూ పొగడుతుండేవారు – సమాఖ్య కార్యక్రమాలన్నిటికీ వారు విచ్చేయడ మేకాకుండా చాలా చక్కటి సలహాలు ఇస్తుండేవారు. 'సమాఖ్య' తరఫున చిలకమర్తి వారి శతజయంత్యుత్సవాలు జరపమని వారు కోరుతుండేవారు. అనివార్య కారణాలవల్ల మేము గత సంవత్సరం జరపలేక, యీ సంవత్సరం జరపాలని నిశ్చయించుకుని మా నిశ్చయాన్ని వారికి తెలియజేసినప్పుడు వారి ముఖంలో తాండవించిన ప్రసన్నత ఇప్పటికీ నాకళ్ళకు కట్టినట్టున్నది. ఈ సందర్భంగా చిలకమర్తివారి ప్రహసనాలలోని కొన్ని ముఖ్యమైన దృశ్యాలను ప్రదర్శించేందుకు వారి సలహాలను, సహాయాన్ని కోరినవెంటనే వారు తనవద్దనున్న చిలకమర్తి గ్రంథాలన్నీ ఇచ్చి, తనవద్దలేని ఒకటి రెండు ప్రహసనాలను ఆంధ్రనుండి తెప్పించి మాకిచ్చారు. వారి కోరికను మేము తీర్చకుండానే వారు కన్నుమూసారు.

శ్రీ వాత్సవగారు ప్రఖ్యాతవిమర్శకుడని తెలియనివారుండరు. వారుప్రతి సంవత్సరం మొదట్లో గడిచిన సంవత్సరంలో వెలువడిన సాహిత్యాన్నంతటినీ కూలంకషంగా చర్చిస్తుండేవారు– యీ సందర్భంగా మరోవిషయం చెప్పక తప్పదు. శ్రీ వాత్సవగారిపైన ఒక పెద్ద ఆరోపణ ఉంది– అదేమంటే వారు కొన్నిసార్లు పుస్తకాలు క్షుణ్ణంగా పరిశీలించకుండానే, Back ground నర్థం చేసుకోకుండానే విమర్శకు పూనుకుంటారని. ఈ ఆరోపణలోని సత్యాసత్యాలు చర్చించే సమర్థత నాకులేదు. నాకున్న పరిచయంలో యీ ఆరోపణలో కొంతనిజం లేకపోలేదని మాత్రం నాకనిపిస్తోంది. వారి పెర్సనాలిటీకి ఇది ఒక లోపం అనికూడా చెప్పకతప్పదు.

శ్రీ వాత్సవగారు చాల భాషలు తెలిసినవారు. వారి గ్రంథాలయంలో తెలుగులోని ఇతర భాషలలోని మేటి గ్రంథాలన్నిటినీ ప్రోగుచేశారు. వారు ఆఫీసు వదలితే అటు ఏ సాంస్కృతిక, సాహిత్య కార్యక్రమాల్లో లేని పక్షంలో ఇంట్లో కూర్చుని ఏ పుస్తక పఠనంలోనో గడుపుతుండేవారు. ఎంతటి క్రొత్తవానితోనైనా బాగా పరిచయమున్న వ్యక్తివలె నిండుమనస్సుతో ఆహ్వానించి, ఆదరించి, అభిమానం పంచిపెట్టిన వ్యక్తి 'శ్రీవాత్సవ'—అందుకే అతను మరుపురాని మనిషి.

---

# మహాప్రస్థానంలో కొసమెరుపులు

వరవరరావు

సామాన్యంగా కథ నడిచి, అద్భుతంగా, పాఠకుడు ఊహించని విధంగా ముగిసినపుడు దానికి 'ఓహెన్రీ' ending అని ఒకజాతీయ మేర్పడి పోయేంత గాగొప్ప కథను ముగించేవాడు ఓ. హెన్రీ. అనేకథకుడు.

అలా కవిత్వంలో 'శ్రీశ్రీ చివరి చరణాలు' అనాలనిపిస్తుంది, అద్భుతంగా ఖండికలు ముగిసినపుడు. అందరికీ తెలిసిన అద్భుతమయిన ముగింపు

"ప్రపంచమొక పద్మవ్యూహం.
కవిత్వమొక తీరని దాహం."

చాలా మంది పండితభిషక్కులు, 'మహా ప్రస్థానంలో ఏముంది—కుక్కపిల్ల, అగ్గిపుల్ల, సబ్బుబిళ్ళతప్ప అని విమర్శించే విమర్శకులు, "ఋక్కులు" అనే గీతానికి ఈ చివరి రెండుచరణాలు ప్రాణం అన్న విషయం మరచిపోతారు.

(మనస్సులోగాదు, మనకు శ్రీశ్రీ ని తేలికచేసి చెప్పాలనే పాక్షిక దృష్టివల్ల. అందుకే అన్నాడు మరి చలం, "స్వయంగా చదవండి చదివిన తరువాత శ్రీశ్రీని చూడాలనిపిస్తే, స్వయంగాచూడండి ఎవరి అభిప్రాయమూ అడుగకండి. ముఖ్యం .. " తరువాత చలం ఏం రాశాడో నేను చెప్పను. మీరే మహాప్రస్థానం స్వంతంగా కొనుక్కొని చదువుకోండి.)

సాహిత్యంలో సినిమాల ఊసుఎత్తితే ఈ మధ్యనేకొందరు సాహిత్యం మైల పడిపోతున్నదని ఉతికి ఆరవేసుకున్నారు. కాని నాకు తప్పడంలేదు. నేను విశ్లేషించి చెప్పలేని శ్రీశ్రీ కవిత్వంలోని విలువలకు ఒక సినిమాని ఉదహరించడం:

"నిప్పులు చిమ్ముకుంటూ
నింగికి నేనెగిరిపోతే

నిబిడాశ్చర్యంతో వీరు
నెత్తురు కక్కుకుంటూ
నేలకు నే రాలిపోతే
నిర్దాక్షిణ్యంగా వీరే"

అన్న 'ఆః' అనేగీతం, 'ఋక్కులు' లోని చివరి రెండు చరణాలు చదివినప్పుడల్లా 'ప్యాసా' అనే చిత్రం గుర్తుకొస్తుంది. అలాగే ఆ చిత్రం చూసినా ఆ వాక్యాలు గుర్తుకొస్తాయి. నేననుకొంటాను, నాలాంటి సామాన్య పాఠకునికి, నాలాంటి సామాన్య సినీ goer కు ఈ చరణాల్లోని భావం, చాల identify చేసి చూపగలిగానేమో, ఈ చిత్రాన్ని ఉదహరించి అని.

శ్రీ శ్రీ ఋక్కులురాసి ముప్పై ఏళ్ళవుతూన్నది. అనాటికింకా రెండవ ప్రపంచ యుద్ధం, యుద్ధోన్మాదుల కలల్లోనే వున్నది. కాని ఒక గొప్పఆర్థిక సంక్షోభం, లోలోపలనే అట్టుడికి పోతున్న ద్వేషాలు ప్రపంచం ఒక పద్మవ్యూహంలాగే వున్నది. ఈనాడు కూడా మార్పులేదు.

ఒక విషవలయంలో ఒక పన్నాగంలో వంచనలో చిక్కుకొని బయటపడలేని వాణ్ణి పద్మవ్యూహంలో చిక్కుకున్నాడంటాము. కాని ప్రపంచమనే పద్మవ్యూహంలో సాలెగూడులో వెర్రి పురుగు చిక్కుకొన్నట్లుగా కాక, అభిమన్యునిలా ప్రవేశించే సాహసం కావాలంటాడు శ్రీశ్రీ.

'అనర్గళం అనితరసాధ్యం నామార్గం' అని 'ఐ' అభవన ఆ మార్గాన్ని విశదపరిచే నా వెర్రియత్నాన్ని వెక్కిరిస్తున్నాడు. శ్రీ శ్రీ కార్మికలోకపు కళ్యాణానికి, శ్రామిక లోకపు సౌభాగ్యానికి వైప్లవ్య గీతాన్ని విరచించినాడు. ఆయన నిర్మించిన 'దుర్గంలో' రాజులు, రాణులు వారిపరివారంకాదు, కమ్మరి కొలిమీ, కుమ్మరిచక్రం, జాలరి పగ్గం, సాలెల మగ్గం ఉంటాయి. ఆయన స్వప్నించిన స్వర్గంలో కాల్చేఆకలి, కూల్చేవేదన, దారిద్ర్యాలు దౌర్జన్యాలు ఉండవు. శ్రమైక జీవన సౌందర్యంతో శోభించే స్వర్గం అది.

అనర్గళం అనితర సాధ్యంగానే వుండి పోయింది ఆయన మార్గం.

"పుడమి తల్లికి పురిటి నొప్పులు
కొత్త సృష్టిని స్ఫురింపించాయి."

మహాప్రస్థానంలోని చాలా గేయాలకు భూమిక అయిన గీతం (back ground song) 'మరో ప్రపంచం ...' (శ్రీశ్రీ గేయాలు ఎత్తుకోవడం శిల్పాన్ని గురించి ఎపుడయినా చెప్పితే—చెప్పాల్సిన అవసరం ఎంతోవుంది—చెప్పాలి దాన్నిగురించి.) ఆయన ఇతర గేయాలలోని 'వస్తువు'కి అది ప్రాతి పదికగా గ్రహించనినాడు 'మహా ప్రస్థానం' గీతం లక్ష్యాన్ని, ఆదర్శాన్ని మనం ఉపేక్షిస్తున్నామన్నమాట.

మరో ప్రపంచం, మరో ప్రపంచం.

మరో ప్రపంచం పిలిచింది, అన్నాడు. ఇక్కడ 'క్రొత్తసృష్టి' గురించి చెపుతున్నాడు ప్రక్కనే 'జ్వాలా తోరణం'లో 'పుడమికి నేడే పుట్టిన రోజట' అంటాడు, 'అభ్యుదయం' అనే గేయంలో 'నేడే ఈనాడే ఈనాడే జగమంతా బలివితర్ది! నర జాతికి పరివర్తన, నవజీవన శుభసమయం అభ్యుదయం' అన్నా 'వస్తున్నాయొస్తున్నాయ్. జగన్నాథ జగన్నాథ జగన్నాథ రథచక్రాల్' అన్నా అన్నింటిలోనూ, ఒక కొత్త వ్యవస్థను, ఇదానీం వ్యవస్థకు భిన్నమయిన దానిని, విలక్షణమయిన దానిని విప్లవాన్ని ఆయన ఆహ్వానిస్తున్నాడన్నది ఆయన ఆకాంక్షిస్తున్నాడన్నది చాలా స్పష్టం. అది చాలా వివరంగా చెప్పడం ఇక్కడ నా పనికాదు. 'అవతారం' అనే ఖండికలో అన్ని సంప్రదాయకమయిన విశ్వాసాలను, Imageriesగా చెప్పి చివరికంటాడు— ఇపుడు పుడమి తల్లి పడుతున్న ప్రసవవేదన సృష్టినేకాదు, కొత్త సృష్టిని స్ఫురింప చేస్తున్నది—అని. ఆ సృష్టి ప్రభావం స్వర్గాన్ని సైతం కదిలించివేసింది. ప్రకృతినంతా పరవశంచేసింది. నిజంగా అలాంటి కొత్త బ్రతుకు వచ్చింది ప్రపంచానికి, అని రాసి వివాదాస్పద రాజకీయాల్లోకి పోను. నేను చెప్పాల్సిన అవసరం లేకుండ 'జ్వాలా తోరణం'లో ఆయనే చెప్పాడు. కొత్త సృష్టిపండుగ జరుపుకోవడానికి అయన జ్వాలా తోరణం కట్టాడు. 'అదెసంవర్తపు తుఫాను మేఘం తొలిగర్జించిన తూర్యవిరావం. అనాథజీవుల సమాధులన్నీ అఘోరించి ఘోషించాయి.' ఇవి ఆఖరి చరణాలు కాదు కొత్తసృష్టి లక్షణాలు. 'అనాధ జీవులే' సమాధుల్లా నిశ్చేతనులై యేరోజులు పోయి అనాథజీవుల సమాధులే ఘోషించే – మార్పు వస్తున్నది. అప్పుడప్పుడే అవనిమీద. అదిచాలదా పుడమికి పుట్టినరోజు జరుపుకోవడానికి.

నవ కవితావస్తువు లేమిటో చాలా list ఇచ్చాడు శ్రీశ్రీ. చాలా మందికి అందులో సైద్ధాంతిక (idealogical) వాసన వస్తుంది. ఆ 'ఎగిరేసిన ఎర్రని జెండా' చూసి కళ్ళుచెదిరిపోయే వాళ్ళకొరకు ఆ ఘాటెక్కిన గంధక ధూమానికి

ముక్కుల్లోంచి రక్తం పడేవాళ్ళకొరకు, ఆ రాబందుల రెక్కల చప్పుడుకు గుండెలు బేజారయి పోయేవాళ్ళకొరకు అవేవీ ఉదహరించి వానిలోని విశేషాలు చెప్పను. నేను గీసుకొన్నగిరి ప్రకారం అది నా పనికూడాకాదు.

"కదిలేది కదిలించేదీ
మారేది మార్పించేదీ
పాడేదీ పాడించేదీ,
పెనునిద్దుర వదిలించేదీ,
మునుముందుకు సాగించేదీ,
పరిపూర్ణపు బ్రదుకిచ్చేదీ.

నవకవనానికి కావాలని శ్రీశ్రీ అన్నపుడు మాత్రం ఆయనతో చేతులుకలుపనివాళ్ళు ఉండరు. ఆయనతోపాటు కదిలేవాళ్ళు, మారేవాళ్ళు వుంటారా అంటే వేరే విషయం. ఒక ఊపు, ఒక చైతన్యం, ఒక పరిణామం ఉద్ధృతంగా కొనివచ్చి శతాబ్దాల సుషుప్తి నుంచి మేల్కొల్పి బూజుదులిపి బంగారు సూర్యోదయాన్ని చూపలేని 'కవిత కరక్కాయ నిజం.' ప్రగతి పథం నిర్దేశించి జీవితానికి పరిపూర్ణత్వాన్ని కల్పించలేని కవిత నిరర్థకం. మరి 'పరిపూర్ణపు బ్రతుకునిచ్చే' కవిత్వమెలాంటిది. కవిత్వం ఎలా పరిపూర్ణపు బ్రతుకిచ్చి పైన చెప్పినదంతా చేయగలుగుతుంది అని ప్రశ్నిస్తే 'మహా ప్రస్థానం', చదవండి అని నమస్కరించిడమే నా జవాబు.

'తీరికగా చదవండి. కావలిస్తే పదేళ్ళు ఆగండి. ఈ లోపల ఆస్తి సంపాదించడం పిల్లల్ని కనడం, ధరలు హెచ్చడంకాక, జీవితంలో' ఇంకా ఏమన్నా మిమ్మల్ని అమితంగా influence చేసినవి జరిగివుంటే.... అపుడు అవగాహన అవుతుంది- ఈ తీరని దాహం, ఏదాహమూ తీర్చలేని ఆవేదనా దాహాన్ని ఎలా తీర్చగలదో.

'ప్రతిజ్ఞ' అనే ఖండిక చివర తావినుతించే తావిరుతించే తావినిపించే, నవీనగీతికి, తావిరచించే నవీన రీతికి, భావం, భాగ్యం, ప్రాణం, ప్రణవం— ఏవేవో చెప్పాడు. అవి సందర్భవశాత్తు మొదటే చెప్పాను. అవి సహస్ర వృత్తుల సమస్త చిహ్నాలు.

ఓ హెన్రీ కథల్లో ఆఖరి వాక్యం చదివాకగాని, ఆ వెలుగులో ఆపైచెప్పిందంతా నెమరువేసుకొని నిజంగా ఎంతగొప్పగా ఈ ఒక్క వాక్యంకోసం ఇదంతా పోషించు

కొచ్చాడు అనుకుంటాము. ఋక్కులు, అవతారం, జ్వాలా తోరణం, ప్రతిజ్ఞ చివరి చరణాలు చదివినప్పుడు అలా feel అవుతాము.

శ్రామిక లోకము తన నవీన గీతికి, నవీన రీతికి, ప్రాణం, ప్రణవం— అంటున్నాడు. పద్య ఛందస్సుల ఫ్యూడలిజం నుండి, మాత్రా ఛందస్సుల ప్రజా స్వామ్యయుగానికి కవిత్వాన్ని గురజాడ కొని తెచ్చాడంటాడు శ్రీ శ్రీ. ఆ మాత్రా ఛందస్సుల ప్రజాస్వామ్య యుగంనుండి ముక్త ఛందస్సుల సోషలిజంవేపు కవిత్వాన్ని కదం త్రొక్కించాడు శ్రీ శ్రీ. అక్కడితో ఆగక, తన 'ఆకాశాలను లోకానికి చేరువగా తన ఆదర్శాలను సోదరులంతా పంచుకొనే వెలుగుల రవ్వలజడిగా' తన రచనలలో లోకం ప్రతిఫలించే– state less society వంటి–సీమలులేని కవిత్వాన్ని ఆవిష్కరించాడు.

మహాప్రస్థానంలో మూడు కథలున్నాయి. అంటే చక్కని కథల్లాంటి narrative poems ఉన్నవి. ఓహెన్రీ ముగింపులతో శ్రీశ్రీ ముగింపులు ఎందుకు పోలుస్తున్నారో అవి చదివితే బాగా తెలుస్తుంది. అవి బాటసారి, భిక్షువర్షీయసి, ఆకాశదీపం.

ఒక కొడుకు తల్లి మాటలు చెవినిపెట్టక పట్టణంలో బ్రతుకుదామని (సరదా పడి కాదు) కూటికోసం, కూలికోసం బయలుదేరాడు. మూడురోజులు ఒకేతీరుగా తిరిగినా కూడా బ్రతుకు తెరువు దొరకలేదు. దిక్కుతెలియక బాట తప్పాడు. పల్లెటూళ్ళో తల్లి కళ్ళన్నీ వాకిట్లోనే. అతనికి శిరోవేదన అతిశయించింది. నల్లని రాతిపోలిక రాత్రి గుండెమీద కూర్చున్నది. తల్లి తనను పిలుస్తున్నట్లు దృశ్యాల్ తోస్తున్నాయి. అతను చనిపోయాడు. బాటసారి కళేబరంతో శీతవాయువు ఆడుకుంటోంది. 'పల్లెటూళ్ళో తల్లికేదో పాడుకలలో పేగుకదిలింది.' 'పూర్ణిమకన్నులు కలువలచేరెను. పూర్ణిమపడకలు హంసల చేరెను, దుర్గను చేరెను పూర్ణమ్మ.' అన్న గురజాడ ముగింపుకన్నా కూడా ఎంతో Symbolic గా ఎంతో Suggestive గా ఉన్నది ఈ ముగింపు.

'భిక్షువర్షీయసి' చనిపోవడానికి నిజంగా ఎంగిలాకే కారణం. ఆ ఎంగిలి పడకనే కడుపులోకి ఆ ఆదరువులేకనే ఆ ముసల్ది చనిపోయింది. మాంసం తిన్నంత దొరికిన వాళ్ళు ఎముకలు పారేస్తున్నారు. ఎముకలు కొరుక్కు తింటున్న కుక్కకు వెర్రిగాలి ప్రశ్నకు జవాబు చెప్పాల్సిన అవసరమే కనిపించలేదు. తొండ ఒక ఈగను పడవేసుకొని తొందరగా తొలిగిపోయింది 'ఆ అవ్వే మరణిస్తే ఆపాపం ఎవ్వరి'దని

ప్రశ్నించిన 'వెర్రిగాలి' శ్రీశ్రీ. ఆ కుక్క తొండ-ఈ సమాజంలో ఎవరో నేనుచెప్పాల్సిన అవసరం లేదనుకొంటాను.

'గదిలో ఎవరూలేరు గదినిండా నిశ్శబ్దం సాయంత్రం ఆరున్నర గదిలోపల చినుకులవలె చీకట్లు' (ఇలా ఆరంభమైన కథలను అసంఖ్యాకంగా చూపవచ్చు ఈనాడు పత్రికల్లో) ఒక దురదృష్టజీవి ఉదయం ఆరున్నరకు ఆగదిలోనే ఆరి పోయాడు. ఆ దురదృష్టజీవికి కత్తిగంటుమీద నెత్తుటిబొట్టులాగున్న దీపానికి oneness ఆపాదిస్తున్నాడుకవి. ఆకాశతార ఆహ్వానగానంచేసింది, దీపం ఆరిపోయింది. తారగా మారిపోయింది. ఆ దురదృష్టజీవి తారగా మారిపోయాడని, అతన్ని ఆకాశదీపంగా ఆకాశానికెత్తుతున్నాడు కవి-

ఎచటికి పోతావీ రాత్రి
—అవతలి గట్టుకు.

ఇంట్లోవింత భయాలుగొలిపే చీకటి, అపస్వరాలు వినిపించే తెగిన తీగలు, చావు బ్రతుకుల రంగులనీడలు—ఈ రాత్రి వీనినుంచి విముక్తి ఏది? ఈగట్టు మీద వాతావరణం ఇలాఉన్నది. ఇంత అస్థిరంగా అస్తవ్యస్తంగా ఉన్నది. మరి ఎంత రాత్రయినా ఈ రాత్రి సాహసించి అవతలిగట్టుకు పోనిదే అద్భుతమయిన సూర్యోద యాన్ని ఎలాచూడగలం? కొందరు సూర్యుడు ఉదయించేదాక ఈ గట్టుమీదే ఈ చెట్టు నీడనే, ఈ చీకటి చిట్టడవిలోనే చిక్కిఉంటారు కొందరు ఆవలిగట్టుకు పోయయినా ఈరాత్రి గర్భం చీలిస్తేకాని తేజస్సు ఫలించదని ప్రయత్నిస్తారు. సూర్యోదయం కొరకు వేచివుండక చీకట్లను మబ్బులను తొలగించి సూర్యోదయాన్ని చూపిన వైతాళికుడు శ్రీశ్రీ. ఈ అర్థంలో శ్రీశ్రీ భూమి మీదికి గంగను తెచ్చిన భగీరథునికి సాహిత్యంలో సమవుజ్జీ.

చారిత్రక విఘాత సంధ్యల
మానవ కథ వికాసమెట్టిది?
ఏదేశం ఏకాలంలో సాధించినదే పరమార్థం.
ఏ శిల్పం? ఏ సాహిత్యం?
ఏ శాస్త్రం? ఏ గాంధర్వం?
ఏ వెల్గులకీ ప్రస్థానం?
ఏ స్వప్నం? ఏ దిగ్విజయం?

'దేశచరిత్రలు' మానవకథ వికాసాన్ని చూపాలని మానవ సమాజం ఏ వెల్గుల వైపు ప్రస్థానిస్తున్నదో ఏ స్వప్నం ఫలిస్తున్నదో దాచేస్తే దాగని సత్యాలు శోధిస్తున్నాడు కవి.

అభిప్రాయలకోసం బాధలు లక్ష్యపెట్టనివాళ్ళు మాలోకి వస్తారు.

అభిప్రాయాలను మార్చుకొని సుఖాలు కామించేవాళ్ళు మీలోకి పోతారు

ఆ మేమెవ్వరమో మీరెవ్వరో తెలుసుకోవాలనే కుతూహలం 'వ్యత్యాసం' చదివిస్తుంది.

'జగన్నాథుని రథచక్రాల్లో' పతితులను, భ్రష్టులను, బాధాసర్పదష్టులను, దీనులను హీనులను ఇంకాఇంకా ఎందరో హతాశులను ఆహ్వానించి ఈ లోకం మీదేనండి, మీ రాజ్యం మీరేలండీ, అని ముగిస్తున్నాడు. అంటే గీతం మొదలు బెట్టిన నాటికి— జగన్నాథుని రథంవంటి శ్రీశ్రీ కలం కదలిన నాటికి—వీళ్ళంతా పతితులు, భ్రష్టులు, హతాశువులు. అప్పటికింకా మరోప్రపంచం పిలుపులే వినవస్తున్నాయి. మరోప్రపంచం కిరీటపు ధగధగలు మాత్రమే కనిపిస్తున్నాయి. కాని గీతం ముగిసేవరకు జనులవలన తిరస్కృతులే, సంఘానికి బహిష్కృతులే, జితాసువులే, చ్యుతాశయులే లోకాన్ని లోగొన్నారు. ఇంత గొప్ప పరిణామాన్ని (నా ఉద్దేశం ఆగీతం మొదలై ఐపోయేవరకు సమాజంలో ఇంత పరిణామం వచ్చిందనికాదు.) ఊహించి అందుకై బాటలువేసి అంతవిస్తృతమయిన మానవ వికాస చిత్రాన్ని మనకు ప్రసాదించాడు శ్రీశ్రీ.

'మహాప్రస్థానం'తో మొదలై 'జగన్నాథ రథచక్రాల'తో ఐపోయినవి మహాప్రస్థానం గీతాలు. పించిన 'మరోప్రపంచం', మనచేతికి మనరాజ్యాన్ని ఇచ్చింది ఇంతకన్న ఏ కవి తపస్సు ఎట్లావుంటుంది.

ఇలా శ్రీశ్రీ ముగింపుల గూర్చి చెపుతూపోతే నా వ్యాసానికే ముగింపు లేకుండా పోయేట్లున్నది. ఇలాంటి ముగింపులుకాక ప్రచురంగా 'మహాప్రస్థానం' లో ఉన్న ముగింపులు force కోసం చేసిన పునరుక్తులు. అంటే గీతం ఏ మాటలతో ఆరంభ మవుతుందో, ఆమాటలతోనే ఐపోతుంది. వానిగురించి రాయాలంటే అదో వ్యాస మవుతుంది.

'మహాప్రస్థానం' గీతాలలో కొన్నిటిని Three cheers for man అనే పేరుతో శ్రీశ్రీ తానే ఇంగ్లీషులోకి అనువదించాడు. అందులో మొదట Three cheers for the man అని చిత్ర విచిత్ర వ్యక్తులకు అభినందనలు చెప్తూ

—But, will this ever end ?
—No, this will never end.

అంటాడాయన. ఈ 'మహాప్రస్థానం' ముగిసేదికాదు. మరిదీని ముగింపులను గూర్చి వ్రాయడమేమిటి? ఈ దాహం తీరేదికాదు దీనిలోని కవిత్వం గూర్చి ఏం మాట్లాడగలం?

'ఒక ఖండిక రచించడమంటే ఒక విమానాన్ని నడిపించడం లాంటిది. విమానం ఎగిరే అప్పుడు, ఆకాశంలో ప్రయాణించేప్పుడు, తిరిగి నేలమీదకుదిగేప్పుడు ఈ మూడు దశల్లోనూ వైమానికుడు ఎంతో జాగ్రత్త, నేర్పు ప్రదర్శించాల్సి ఉంటుంది. సరే విమాన చోదకునికి సహజంగా ఉండాల్సిన సాహసం గురించి నేను చెప్పాల్సిన పనేలేదు. కవికి కూడ ఈ లక్షణాలు ఎంతో అవసరం'

అన్నాడు శ్రీశ్రీ. 'వినువీధుల్లో విహరించే' శ్రీ శ్రీ కవితా విమానాన్ని 'లోకానికి చేరువగా' ఎలా దించుకాడో చూపే చిరుప్రయత్నంమాత్రమే యీ వ్యాసం.

[వరంగలు 'మిత్రమండలి' లో శ్రీశ్రీ సాహిత్యం గురించి జరిగిన సింపోజియమ్‌లో శ్రీశ్రీ సమక్షాన 13-11-63 రోజు చదివిన వ్యాసం.]

# మనఃకార్మికశాల × సుమనోధార్మికవేల

కె. వి. రమణారెడ్డి

త్రిపురనేని వెంకటేశ్వరరావుగారు రేడియో పత్రిక 'వాణి'లోను, 'హిమబిందు ఆంధ్ర సచిత్ర వారపత్రిక'లోనూ శ్రీశ్రీగారి 'ఖడ్గసృష్టి' గురించి చేసిన విమర్శలను Starting Pointsగా చేసుకొని భిన్నాభిప్రాయమేదైనా ఉంటే దాన్ని ప్రకటిద్దామని ఒకటి;

సమీక్ష సమీక్ష అనే ప్రక్రియను ప్రారంభించినట్లౌతుందని, రెండు;

ఈ కారణాలచేత నేనొక వ్యాసం రాశాను; అది 'సృజన'లో అచ్చై వచ్చి కొన్ని సంచికల కాలం గడిచింది. దానిశీర్షిక 'మనఃకార్మికశాల,' ఆ కావ్యసంకలనంలోని తొట్టతొలి గేయంలోనిదే; ముద్రాపకుల ధర్మమాని దాని ముందూ వెనకా ఉండవలసిన 'ఇన్వర్టెడ్ కామా'లు ఎగిరిపోయి రావుగారి చేత 'సుమనోధార్మికవేల' అనే శీర్షిక పెట్టించాయి. సమీక్ష సమీక్ష అంటే, ముందూ వచ్చిన చెవులకంటె వెనుక వచ్చిన కొమ్ములు వాడి, అన్నట్టుగా, ముందు సమీక్షించిన వారికంటె వెనుక జేసినవాడు తెలివిమంతుడని నా ఉద్దేశంకాదు. నేతృత్వంలోనూ శబ్దనేతృత్వంలోనూ మరెందులోనూ ఆధిక్యం నాకుందని అనుకోవడంలేదు. అయినా ఎత్తిపొడుపులు గుప్పిస్తూ రావుగారి 'సుమనోధార్మికవేల' సుమనోధర్మాన్ని ఆసాంతమూ పాటించ లేకపోయినందుకు విచారంగా ఉంది. త్వంశుంఠా, త్వంశుంఠా ధోరణిలో సిగపట్ల గోత్రాలకుదిగే విమర్శాసంప్రదాయానికి వారసత్వం పుచ్చుకోవడం నాకు మాత్రం ఇష్టంలేదు. అయినా కావ్యచర్చ కాబట్టి, రావుగారు లేవనెత్తిన ముఖ్యమైన అంశాలను ఒకటొకటిగా పేర్కొని, నేను చెప్పదలుచుకొన్నదేదో చెప్పి, గుణాగుణ నిర్ణయాన్ని పాఠకులకు విడిచివేస్తున్నాను.

(1) ఛందస్సు, అలంకారాలు, ధ్వని, వ్యంగ్యం, ఔచిత్యం—కవిత్వానికి ఈ వస్తువుల అవసరాన్ని గురించి కొత్తగా ఎవరు చెప్ప గలిగిందీ అంత ఎక్కువగా ఉండదు. ఆధునిక కవులకూ ఆలంకారిక ప్రమాణాలకూ సగమెరిక. వాటి గొప్పదనం ఎంత గొప్పదైనా, ఆస్పృహ వారికి అట్టే లేదు. "సాధికారంగా" కాదు, సవినయంగానే నేను చెప్పదలుచుకొన్నదిదే. శ్రీశ్రీ తన కవితా గేయనిర్మితికై ఏరిన నానాధ్వనులకూ " ధ్వని " మతానికీ ఏలాంటి చుట్టరికముందో నాకైతే తెలియదు. రాజకీయ కవిత్వమైనా తత్వకవిత్వమైనా కవిత్వప్రమాణాలని ఏవైనా కొన్ని సిశ్చల పదార్థాలు లోకంలో ఉంటే వాటికి తగ్గకుండా కవిత్వం చెప్పాలని నేనుకూడా భావిస్తున్నట్లు, లోగడ నేను రాసిన అనేక వ్యాసాలను బట్టి ఎవరైనా గ్రహించగలరు.

(2) మరి నేను తమతో పెట్టుకొన్నానని రావుగారంటున్న "తగువు" దేన్నిగురించి? కవిత్వ ప్రయోజనం గురించి ఏమో! యశస్సు, అర్థం. వ్యవహారం. ఉపదేశం మొదలైన ప్రయోజనాలతోబాటు కాంతా సమ్మితత్వాన్ని సద్యఃపరనిర్వృతిని నిర్దేశిస్తూ విశాలమైన జాగా కల్పించి ఉన్నారు ఆలంకారికులు. ఇంగ్లీషు మాట Didactic కూ విదుర నీతీ వగైరాల్లోని ఉపదేశాత్మకతకూ సాటుప ఉన్నదనుకొంటే కవిత్వం వట్టి ఊకదంపుడుగా మారగూడదని ప్రతివాడూ ఒప్పుకొంటాడు. అలాకాక, 'ఉద్ఘాటనల' కిందికి అనుభవ ఫలాలైన కావ్యచరణాలన్నిటినీ నెట్టివేసి వీటిలో కవిత్వమే లేదనడం, ఆ కవి పట్ల సుమనోధార్మికత కొరవడడమౌతుందని మాత్రమే నేననేది. డాంటే, గెటేలదాకా ఎందుకు, తిక్కన లాంటి అస్మదీయులకు గూడా వంకలుబెట్టే వీలు ఇందువల్ల విమర్శకులకు చేకూరుతుంది.

(3) 'ఖడ్గసృష్టి'లో ఇదుగో ఇక్కడ కవిత్వం వచ్చి గూడుకట్టుకొని ఉన్నది, అని నేనై కొన్నిచరణాలను తీసి పాఠకులకు చూపానని రావుగారనడం నిజంకాదు పరిగదా, న్యాయం కూడాకాదు. ఆ గేయాలనుంచి శ్రీశ్రీ వైయక్తిక తత్వాన్ని రాబట్టే ప్రయత్నంలోనే, ఆచరణాలను ఎత్తి చూపవలసి వచ్చింది. అభిరుచి నిర్ణయంలోనేగాక అభిరుచి కల్పనలోనూ విస్తరణలోనూ పాఠకులకంటె ఎంతో ముందుండవలసినవాడు, దారివేయవలసినవాడు, విమర్శకుడే 'ఉత్తమాభిరుచి' అనేదదుస్సాధ్యమైన ప్రమాణాలను స్థాపించి, గ్రీక్ రాక్షసుడు ప్రాక్రుస్టెస్‌వలె, వాటికి తగ్గినవాటినన్నిటినీ తెగగొట్టి వేయరాదేమో!

(4) కాడ్వెల్ కూడా ఖండించాడని రావుగారంటున్న ఈ 'ఉద్ఘాటనలు' శుష్కనినాద ప్రాయాలా, లేక కవి భావప్రకటనలా? వీటి నిర్మితిలో హృదయానికేదైనా పనిబడిందా, లేక వట్టి మెదడుకేనా? అలాగైతే హృదయమూ మెదడూ వేర్వేరు అరలా లేక ఒకదానిపై మరోదాని ప్రభావం ఉందా? అలంకారాలతో ప్రతిపద్య—ప్రతిపద రసోదయం కలిగిస్తూ స్వప్నాన్నో భ్రాంతినో కల్పించి ఆహ్లాదం గొల్పడమేనా కవిత్వధర్మం, లేక వాస్తవలోకాన్ని కవి తన విలక్షణమార్గాన దర్శించి తన ఊహల బలంతో ఆ దర్శనానుభూతికి అక్షర రూపమిచ్చి మనస్సులను తట్టి మేల్కొల్పుతూ మనుషులను ఉద్బోధించడం కూడానా? ఈ ప్రశ్నలెంత పాతవో అంత కొత్తవిన్నీ.

షెవల్ అనే జర్మన్ తాత్వికుడు కళకు రెండు ధర్మాలున్నాయన్నాడు. అహ్లాదాత్మకమైనదొకటి—'అపోలోనియన్'; ప్రభోధాత్మకమైనదింకొకటి—'డయోనీసియన్.' వీటిని గురించిరాస్తూ ఒక ఆధునిక మార్క్సిస్టు సాహిత్యవిమర్శకుడు—ఎర్నెస్ట్ ఫిషర్ The Necessity of Art లో ఇలాగన్నాడు. ఆయాకాలాలనుబట్టి ఈ రెంటిలో ఏదో ఒకటి ప్రబలంగా ఉంటుంది, గాని సర్వకాలాల్లోనూ కళ తన ఆదిమ మూలమైన ఇంద్రజాల గుణాన్ని, లేదా భ్రమోత్పాదకగుణాన్ని విడనాడగూడదు. వాస్తవాన్ని ఉన్నదున్నట్టుగా చెప్పడంగాని, చిత్రీకట్టడంగాని కళకాదు:

True as it is that the essential function of art for a class destined to change the world is not that of making magic but of enlightening and stimulating action, it is equally true that a magical residue in art cannot be entirely eliminated, for without that minute residue of its original nature, art ceases to be art. (P. 14)

శ్రీ శ్రీ చేసినాడని రావుగారంటున్న "ఉద్ఘాటనలు" ఈ magical residue ను కోల్పోయాయా లేదా అనికాదు ప్రశ్న. ప్రకరణనుంచి విడదీసి విడిగా ఎత్తి చూపినప్పుడు, ఎంతటి మహాకవి రచనలోనైనా ఇలాంటివి తగలకపోవు. శ్రీ శ్రీ లోకదర్శనానికి అవి కవిత్వరూపప్రకటనలు మాత్రమే. ఆద్యంతాలు ఏక స్థాయిలో పద్యంనుంచి "రసం" బొటబొటా కారదని, purple patches లాంటివి కొద్దిగానేఉంటాయనీ నేను చెప్పవలసిన పనిలేదు.

(5) ఇంతకూ కిప్లింగు కవిత్వమూ శ్రీశ్రీదీ ఒకలాంటిదేనా? రాజకీయాలను కావ్యవస్తువులుగా స్వీకరించేవరకే వారిద్దరికీ ఏదైనాపోలిక. 'వెర్సు' (verse) కూ 'పొయిట్రీ'కీ టి. యస్. ఇలియట్‌లాంటి విమర్శకులు చూపిన తేడాను. విమర్శక లోకమంతా తలదాల్చిందని నేననలేను. వాటిమధ్య విలువలకు సంబంధించిన తీర్పు (value judgement) తానివ్వడం లేదంటూ ఇలియటే స్వయంగా రాశాడు. (On poets and poetry: Rudyard kipling P. 251) ఇక. కిప్లింగు గొప్పకవి అంటూ ఏ విమర్శకుడైనా రాసి ఉన్నాడా. అని రావు గారడుగుతున్నారు. గొప్పకవి (major poet) అయినా కాకున్నా, మహాకవులకున్న ఒక అసాధారణ శక్తి—తన కావ్యచరణాలను స్వజాతి జనుల వాగ్వ్యవహారంలోకి సూటిగా ప్రవేశింపజేసేశక్తి–కిప్లింగు కుండేదని లారెన్స్ డ్రెలె అంటున్నాడు (key to modern Poetry P. 86). A classic of the second rank అని వార్డు రాశాడు. (Twentieth century English literture, P. 146). ఆధునిక విమర్శకుల నిర్ణయం ఇలాగుంది. ఒక్క మాటతో కొట్టిపేయదగిన కవేమీకాదు కిప్లింగు. వాల్ట్ విట్మన్ అంతకంటె కాదు. 1930లో సాంఘికోత్తేజంతో కవిత్వం రాసిన ఆడెన్, స్పెండర్, మేక్నీస్, డేలెవిస్ ప్రభృతులు మరీమరీ కాదు. సౌందర్యవాద శిఖరాల మీదినుంచి చూస్తేనే తప్పు. ఈ కవులెవ్వరూ క్షుద్రులనిపించరు, అలా అనిపించే మనస్తత్వమే ప్రమాదకరమైనది. అది నిరంకుశ విమర్శకు దారితీస్తుంది. ఈ చివరివారినిగురించి స్కాట్ జేమ్సు ఏమంటున్నాడో చూద్దాం: "The 'modern poets,' by example and precept, have successfully destroyed respect for 'all too musical,' the sentimental, the nonsensical in poetry, for querulousness, vogueness mere prettiness. They cultivated the use of hard, vivid and brutal images. They adminstered a tonic that was needed, though the tonic was bitter. They introduced an educated male intelligence into the practice of art, and refined the dross of loose thinking and metrical verbiage. They became exacting critics of the contempo–rary world, the contemporary scene. (P. 223–224). ఒక్క–వేటుతో ఇందరు కవుల తలలుత్తరించి అకవులను చెయ్యడం ఎంత సులువు!

(6) 'యోని' గురించి ఇప్పటి వరకు ఉప్పతిల్లిన ధ్వనిచాలు. 'హిమబిందు' ఆ శబ్దాన్ని పునరుల్లేఖించి "సాధుసాధు" అన్నందుకు. అంత ఉలికిపాటెందుకనే ధోరణిలో నేను రాస్తే, ధ్వని గురించి అలాంటివారికి నేర్పేపని నీకెందుకని రావుగారు నన్ను నిలదీశారు. "శాస్త్రయోనిత్వాత్" అని బ్రహ్మసూత్ర భాష్యంలో చదివినవారు యోనిగురించి గాభరాపడడమేల? 'శాస్త్రకారణత్వాత్' అనక 'యోనిత్వాత్'అని ఎందు కనవలసి వచ్చింది భాష్యకార్లు? అశ్లీలమైన శబ్దాన్ని ప్రయోగిస్తేనే గాకుండా అశ్లీలార్థస్ఫురణ కలిగినాకూడా చెవులు మూసుకోవలసినదేగదా! అశ్లీలమని కవికి బొత్తిగా తెలియక, ఒక మంచి గీతాన్ని ఒకే ఒక్క పలుగాకి మాటతో చెడగొట్టుంకొటూ, యోనిశబ్దాన్ని వాడినాడనుకొందామా? లేక అశ్లీలమని ఇతరులనుకొన్నా తాను సూచించ దలచిన గంభీరార్థంయొక్క అవసరాన్నిబట్టి, దాన్నివాడ సాహసించాడనుకొందామా? Struggling to be born అనే అర్థంవచ్చేందుకు 'ప్రసవవేదనలు', 'పురిటినొప్పులు' వగైరా వాడిఉండవచ్చుగదా? అలా వాడకేదంటేనే కవి ఉద్దేశమేదో బోధపడుతుంది. కవి ఉద్దేశంతో నిమిత్తంలేని విమర్శ సర్వాధికారికాబోదు సరిగదా, శ్మశానాధికారి అవుతుంది. కవులు విమర్శకుల బానిసీళ్లుకావలసి వస్తుంది.

(7) మార్క్సిజం. ఫ్రాయిడిజం వగైరా చర్చల్లోకి నేనిప్పుడిక్కడ దిగడంలేదు. అయితే ఒకమాట. మార్క్సిజం ఎప్పటికప్పుడు చేర్పుమార్పులకు లోనౌతున్న, లోనుకావలసిన భావజాలం. జాకొలిండ్సే వంటి విమర్శకులే ఎగ్జిస్టెన్షియలిజానికి మార్క్సిజానికి పొత్తు కలవాలంటున్న రోజులివి. అయినా మార్క్సిజం 'నైర్మల్యం' గురించి, రావుగారెంత అనుభవజ్ఞులైనా పెద్దగా నేర్పగలిగిందికేదనుకుంటాను. అలాగే సర్రియలిజం గురించికూడా, నేనుగానీ, వారుగానీ ఎక్కువగా చెప్పగలిగిందిలేదు. ఫ్రెంచి సర్రియలిస్టు కవులుకూడా పూర్తిగా automatic Writing సాధించ లేకపోయారని సాహిత్యచరిత్ర చెబుతున్నది, ఈ విషయంలో నారాయణబాబు కంటె వెనుకబడిన శ్రీశ్రీ, చైతన్యసీమదాటి అవ్యక్తజగత్తులో మునిగి దాని వివరాలన్నిటినీ కాగితానికి ఎక్కించగలిగాడని నేననుకోను. బతికించాడు, అర్థాన్ని అధ్వాన్నపు అడివిలో వదల్లేదు. అయినా ఇతరుల దృష్టిలో సాహసమనిపించేంతటి వైచిత్రిని తన అనేకరచనలలో సాధించుకునేందుకైనా, ఈ సర్రియలిస్టు పద్ధతి శ్రీశ్రీకి పనికివచ్చింది. లాభనష్టాలంటే నాదృష్టిలో ఇవే. కాడ్వెల్ పుస్తకాన్ని ఇంతవరకూ చదివి ఎరగని నేను 'అనవాయితీ' మాటల నెలా రాయగలను? అయినా ధ్వనీక్యాది శబ్దాలను ప్రయోగించడం 'అనవాయితీ' కాకపోతుందా?

(8) 'గుణగ్రహణైకదృష్టి' నాకున్నదని రావుగారు హేళనచేస్తున్నారు. మంచిది. దోషనిరూపణైక శక్తి లేనందుకే ఎవరైనా సంతోషించాలి. ఆ దృష్టిని కాస్త కెన్నెడీ మీదికి ప్రసరింపజెయ్యమని సలహా. అంత ఔదార్యం నాకింకా అలవడలేదు. క్లియోపాత్రా నాసిక మరోలా ఉంటే చరిత్ర తారుమారై ఉండేదని, వ్యక్తుల గుణ గణాలు ఒకదేశ చరిత్రను దాని క్రమం నుంచి తప్పించివేయగలవని, అనుకొనేంత చారిత్రిక భౌతిక వాదంకూడా నాఅనుభవానికి వచ్చిఉంటే బాగుండేది.

(9) చివరిమాట. త్రిపురనేని వెంకటేశ్వరరావుగారేకాదు, 'హిమబిందు' గారు కూడా గౌరవార్హులునాకు. మా దృక్పథాలలోనే అంతరంఉండవచ్చు. అయినా కవిత్వం అకవిత్వమైపోతుందనేంత తేడా విమర్శలో కనిపిస్తే, ఆ కవిత్వంలోనో ఆ విమర్శ లోనో ఏదో లోపం ఉందనుకోవాలి. 'మహాప్రస్థానం' లోనూ, 'ఖడ్గసృష్టి' లో ఉన్నాయని రావుగారంటున్న 'ఉద్ఘాటనలు' ఒకటికాదు, బోలెడున్నాయి. దాన్నిమెచ్చి దీన్నిమెచ్చకపోవడం నాకు విచిత్రమనిపిస్తున్నది.

అయినా శ్రీశ్రీగారి 'ఖడ్గసృష్టి' 'మహాప్రస్థానా'నికి దీటౌతుందని అప్పుడూ ఇప్పుడూ నేనూఅనుకోవడంలేదు. దానిపోలికలు దీనికిలేకపోలేదని దీనిలో ఐదారు మంచి ఖండికలున్నాయని మాత్రమే నేనన్నది. మిగతవికూడా పూర్తిగా కొట్టి వేయదగినవికావు. శ్రీశ్రీవేకాదు, ఏ కవి రచనలనైనా అలాగిరాటువేసే విమర్శకులను నేను మెచ్చుకోలేను—అది నాబలహీనతకావచ్చు. విమర్శకుడు సీయంతకాగూడదు కవులపాలిటి శాస్తకాగూడదనే నాకోరిక.

అలనాటి వసంతంలేకున్నా ఇది శ్రీశ్రీ కవిత్వహేమంతమని నేనన్నందుకు, నా ఉద్దేశాన్ని వెల్లడించినా సరికాదంటూ, రావుగారు హేమంతంచుట్టూ దడికట్టి వేశారు. ఫలరాశికీ పసిమికీ ఆ ఋతువు సంకేతం నాదృష్టిలో. వారిదృష్టిలోవట్టిశైథిల్యానికి సంకేతం! అయినా నావివరణతో వారికి పనేముంది? వారన్నదే వేదం. వారుచెప్పిందే సత్యం! అలాగే నేను కారల్‌శాండ్‌బర్గ్ వాక్యాలను పేర్కొంటే, శాండ్‌బర్గ్‌కాదు, రెడ్డిగారే అలారాస్తున్నారంటున్నారు. దీనిఅర్థం నేను చదవనిదాన్ని చదివినట్లు చూపు తున్నాననా? ఇది అన్యాయం. అయినా ఏంచేద్దాం? శాండ్‌బర్గ్ Harvest poems నేను చూడలేదందామా, ఆయన చూడలేదందామా? ఇంత చండశాసనమైతే ఎలాగండీ బతకడం!

కుందుర్తి కొత్త కావ్యాలు:

# నగరంలో కుందుర్తి—కుందుర్తిలో వాన

మోహన ప్రసాద్

ఇది ప్రసిద్ధ వచన కవితోద్యమ కవి కుందుర్తి ఫ్రీవర్స్ ఫ్రంట్ తరపున వెలువరించిన కొంగ్రొత్త కావ్యం. 1949లో అన్నారు కుందుర్తి:

"ఇది నా కవిత్వం—గీత; వినేవాడు నరుడు
చదువూ సంధ్యలురాని రోడ్డుమీద పామరుడు
లేమి తల్లి యొడిలో నిరంతర గాఢ నిద్రాపరుడు" అని.

ఇప్పుడూ 'నగరంలోవాన'లో అదే అంటున్నాడు. గొంతుమారలేదు. కాని కొంచెం జీరవచ్చిందేమో!

"నిజమైన జనధర్మం పలికేతీరు
లోకంలో కవిత ఒక్కటే," అన్నప్పుడూ (ఇప్పుడు) గొంతు ఒక్కటే. కొంచెం వేదాంతి అయ్యాడేమో. కాని 'శుష్క వేదాంతి' (?) ( క. వి. జనశక్తి ) అయిపోయాడా?

వాన ప్రధాన వస్తువు కనుకనే కాబోలు ఆయన రాసుకున్న ప్రవేశికాకృతిలో ఉన్న సంజాయిషీ ఉరుములూ మెరుపులూ అయ్యింది. ఈ కవితా సంపుటికి తలమానికమైన శీర్షికా కవిత 'నగరంలో వాన' వ్రాయటానికిగల మూలకారణాన్ని కవి వెల్లడిస్తూ, తాను విశ్వనాథ సత్యనారాయణగారి శిష్యుడని చెప్పుకున్నాడు మనతో కూడ. ఒక్క వెంకటేశ్వర్లు గారితోనే కాకుండా. కుందుర్తి ఎప్పుడూకూడ యుగేయుగే నాటినుంచీ తాను మధ్యేమార్గ గామినని చెప్పుకుంటూ వస్తున్నాడు. ఇందువల్ల వచన కవితోద్యమాని కంటె, ఆయన వచన కవితకే ఎక్కువ సదుపాయాలు కలిగినయ్.

వచన కవిత్వాన్ని ఒక ఉద్యమంగా చేసింది ఈయనే. నిర్నిబంధమైన ఏవస్తువైనా ఉద్యమ నిబంధనల్లో వేనికైనా ఎలా కట్టుబడిపోతుంది? 'వచన కవిత' అన్న పుస్తకం ప్రచురించినప్పుడు కూడ, అందులోని వ్యాసకర్తలు అప్పటివరకూ రాయబడిన వచన కవితను, కవుల్ని సమీక్షించారేగాని, అందులోని ఏవ్యాసకర్తా వచన కవిత్వాన్ని ఓ ఉద్యమంగా భావించలేదు. ఈ నాడు వచన కవిత ఉద్యమంగా సాగుతున్నది ఒక్క దిగంబర కవులలోనే. మిగతా వచన కవులెవరూ ఒకరికొకరు తెలియరు. బహుశః ఒకరి కవిత నొకరు చదివికూడ ఉండరు. అలా చదవాల్సిన అవసరమూలేదు. కనక వచన కవిత పూర్తి స్వేచ్ఛతో వ్యక్తినించి, కేవలం వ్యక్తుల్నించి గొప్పశక్తితో ఆవిర్భవించిన నిరవధిక ప్రక్రియ.

ఇక వానచినుకుల విషయం. వాన చినుకులను వర్ణించినతీరూ, సూక్ష్మ పరిశీలన తనవిగాక, కేవలం విశ్వనాథవారి ఏకలవ్య శిష్యత్వం వల్లనే వచ్చినయ్ అనే భావన మనకి స్ఫురింపజేస్తాడు. ఇది చాలా మంచి కవిత అని ఒప్పుకుంటూనే విశ్వనాథ వర్షర్తు వర్ణనకీ, కుందుర్తి నగరంలో వానకీచాల వైవిధ్యం, వైరుధ్యం surrounding లో atmosphereలో, topography లో, themeలో తప్పక ఉంటాయనే ఒక చిన్న అనుమానం ఈ సమీక్షకుడికి కలుగుతూంది. మచ్చుకి, విశ్వనాథకి ఇలావర్ణించే taste, habit, sympathy ఉంటాయా?

"నడి బజార్లో పడిపోయిన మూర్ఛవాడు
బిందెంతో దాహం త్రాగినట్లు ... "

"ఉడువీధి నుండి జారిన ఒక మంచుకొండ ఏదోపగిలి
శతకోటి శకలాలు బిందువులుగా మారి"

"అధరోష్ఠంమీద వ్రాలిన చినుకు
మధువు వాసనవేసి కాబోలు ... ...."

'నగరంలో వాన' అనే ఖండకను వచన గేయం అన్నారు. ఎలా అవుతుంది? వచన కవిత అనాలి.

కుందుర్తి మధ్యేమార్గం ఎటువంటిదంటే—యుగేయుగేలోనూ, ఇప్పటి నగరంలో వానలోనూ పద్యాలు ఇమడ్చటం, ఫ్రీవర్స్ ఫ్రంట్ తరఫున అచ్చువెయ్యటం, విశ్వనాథ ఏకలవ్య శిష్యుడని చెప్పుకోవటం. ఈయన విశ్వనాథ అంటే మరొకరు

శ్రీశ్రీ ఏకలవ్య శిష్యుడనని చెప్పుకొంటారు. ఏ సాంప్రదాయికమైన గౌరవాన్నో, ఏ అసాంప్రదీయ కీర్తినో అడ్డుపెట్టుకోవాల్సిన అవసరం అటుకుందుర్తికిగాని, ఇటు మరొక శ్రీశ్రీ ఏకలవ్య శిష్యునకుగానీ ఎందుకు కలగాలి?

వృత్తాలుకూడ రాయగలిగీ ఇలాంటి అప్రాచ్యపు పని (వచన కవిత) కి ఎందుకు పూనుకున్నామో చూపటానికా అన్నట్లు పద్యాలు ఇందులో ఇమడ్చటం కేవలం వచనకవిత్వమే రాసేవాళ్ళకు, పద్యాలు రాయలేనివాళ్ళకు ఒకదెబ్బ. వాళ్ళకే గాదు, వచనకవిత్వం ఒక ఉద్యమమే గనక అయితే ఉద్యమానికే దెబ్బ. వచన కవితవాగా రాయగలిగిన వాళ్ళల్లో పద్య కవితకూడ రాయగల్గడం ఒక additional qualification కారాదు. ఇప్పుడేమోగాని, ఇక ముందువచ్చే వచనకవులకీ ఛందస్సు అనేది ఒకటి ఉందా, ఉంటే ఎట్లా ఉంటుందేమిటి అనే అనుమానాలు కలుగవొచ్చును. అప్పుడు పద్య కవిత రాయలేమనే దిగులు వాళ్ళకుండదు.

కుందుర్తి కవిగానూ, రాజకీయవాదిగానూ అనార్కిస్టు కాడు. అంచేత—చార్మినార్ మీదపడిన చినుకు బూష్వా చినుకు. శాసన సభా శిఖరంమీద చల్లగా జారిన బిందువు ప్రజాస్వామ్య వ్యవస్థకు ప్రతీక. మనుషుల్లానే చినుకులకీ కోర్టుల కెక్కటమంటే ఇష్టముండదు. హైకోర్టుని తప్పించుకుని ప్రక్కనున్న మూసీనది నెన్నుకుంటై. చివరికి ఈ అనంతధార నావగల్గిందీ శాసింప గల్గిందీ శాసన సభమీద పడిన చినుకొక్కటే. చివరికి దానికే విజయం.

'స్వాభినందన' అనే ఖండికలో కవి, తాను సామాన్యుడికి దగ్గర చుట్టాన్ననీ కాలంతో జీవిస్తూ గాఢంగా భావిస్తూ అమరత్వం కోరేమనిషిననీ, ప్రజలిచ్చేభాషలో పద్యాలు (పద్యాలు?) రాసుకుంటాననీ చెప్పుకుంటాడు. అస్తు.

వాన తర్వాత యీ కవితా ఖండికలో వర్ణనానైవేద్యం సూర్యుడికి దక్కింది. మంచునీ, చలి సంకాంత్రినీ అందంగా వర్ణించాడు. సంక్రాంతి సూర్యుడు నగరపు సూర్యుడుకాడు పల్లెపట్టువాడు. సాతాని జియ్యరూ, ధాన్యరాసి, గంగిరెద్దు, గొబ్బిళ్ళు, గోరంటాకూ అన్నీఉన్న యీ కవితా ఖండం మామూలుగ ప్రతి సంక్రాంతికీ దీపావళికీ వ్యాపార పత్రికల్లోపడే గీతాల్లాలేక ఎంతో ఆనందస్ఫోరకంగా, అందంగా హాయిగా, ఆనందానికి స్థాయిగా ఉంది.

'నెహ్రూ మరణించాడో నేనే మరణించానో' అని గుండె మూలల్లోంచి వొస్తుందో దుఃఖం. 'రోజాపువ్వు' అనే ఖండికకూడ ఇదే విచారంతో రాసిందే. 'ఎవరు వీరులో', 'షష్ట్యంతాలు', 'ఇప్పుడేవచ్చిన వార్త' – చైనా దురాక్రమణ సమయంలో స్వాతంత్ర్య ప్రియుడైన కవి ఆలపించిన గీతాలు. 'నాగార్జున సాగరానికి నాయాత్ర' జాతి సంపద పెంపునికోరే కవి ఆశకి చిహ్నం.

'కాలంతీరు' శిశిరవసంతే పునరాయాతః అన్న అర్థంలో కవిచెప్తాడు. "జనన మరణ సంధ్యల చివళ్ళకు అంటుకుని పరిమితమైనట్లు కంటికి కనిపిస్తుంది" కాలం కానీ నిజానికది, "ఆద్యంత రహితమైన అవిచ్ఛిన్న పలయమూర్తి".

'ఒకమారు రారాదూ చూద్దువుగాని' అని ఈశ్వరుడ్నే సవాలుచేస్తాడీకవి— తన నిరంతరాన్వేషణలో తాను చూచిన దృశ్యాల్నీ తాను సాహిత్యంలో ప్రవర్తింపజేస్తున్న మార్పుల్నీ రెబెల్‌లాగా.

కావ్యావతారికలో కుందుర్తి ఒక సమస్యను చర్చించాడు. కావ్యవస్తువూ రూపమూ ప్రజాబాహుళ్యానికి దగ్గరవుతున్నాయనీ, అందుచేత కవితలో, కవితా వ్యక్తీకరణలో మార్మిక వాద లక్షణములు పరిహరించాలనీను. కవితలో అయోమయత ఉండకూడదు నిజమే, అస్పష్టత ఉండకూడదు నిజమే గాని స్వచ్ఛస్పష్టతను ఎలా గిరిగీచి చూపగలం? ఎవడేనా సాంకేతిక ధ్వనివాద కవితను రాస్తే మార్మికుడికింద కొట్టి పారేయ్యాల్సిందేనా? వ్యక్తివాదమూ పనికిరాదన్నారు. ఎంతవరకు కవి తన కవితలో వ్యక్తి? ఎంత వరకు సమాజంలొ శక్తి? అంతర్వీక్షణం, ఆత్మగతమైన చైతన్యం ఏమీలేకుండానే నగరంలో కురిసిన మామూలు వానని చినుకు చినుకూ ఆపాతమధురంగా వర్ణించగలడా? ఆత్మాశ్రయ కవితఅనేది ఈనాడు పనికిరాక పోయిందేమో గాని, ఏనాడూ అది అర్థంకావటానికి ఏ వివాదాలు అడ్డువొచ్చాయి? ఈ కవికి గురుతుల్యులైన కృష్ణశాస్త్రి గారెవరు మరి? ఈ కవికి గురువైన విశ్వనాథ 'గిరికుమారుని ప్రేమగీతాలు' మాటేమిటి? ఈ కవికి ఒక్కనికే అన్నట్టుగా అంచులదాకా అమృతం నించి గీతాంజలి పాత్ర అందించినదెవరు? అంతర్ముఖుడు కాని పక్షంలో (ఈనాటి వచన కవులు ఇస్మాయిల్, వజీర్ రహ్మాన్, వరవరరావు, చలం, అద్దేపల్లి రామమోహనరావు, సోమసుందర్—వీళ్ళంతా అంతర్ముఖులైన బాహ్యావరణపైన రెబెల్స్ కారా?) కుందుర్తి ఇందులోని 'నీ రథం' అన్న కవిత ఎలారచించగలడు? ఇలా సత్యం హఠాద్దర్శన మివ్వగలదా?

"తత్వ వేత్తల మహాదర్శనం
తలపాగా చుట్టుకుంది
వక్షోజం ఒక్కటే ఉంది
ఒక చేతికి రంగురంగుల గాజులు"

ఈ సత్యం తెల్లగా, చల్లగా, కవిత్వపుగాలిలా, జాలిలా, స్థిరంగా, అజ్ఞానహరంగా, దీపపువెల్లువలా సాక్షాత్కరిస్తుంది. మరి వక్షోజం ఒక్కటే ఉండటమేమికర్మ? అర్ధనగ్న సత్యసందర్శనమా ఇది? ఇందులోని కవి ప్రతీకఏమిటో తెలీకపోతే ఇదీ అస్పష్టతేగా అయోమయతేగనా? ఈ ఒక్క సందర్భంలో తప్ప. ఉపోద్ఘాతంలో కుందుర్తి నించి విడివడాల్సిన అవసరం ఎక్కడా కనిపించదు.

కవిత్వంలో మధ్యవాది అయినట్లే రాజకీయాలోచనల్లో కుందుర్తి మితవాది. బహుశః కుందుర్తి మీద, సోమసుందర్ మీద దుమారానికి, అతివాదుల ఉక్రోషానికి అదే కారణమేమో! అతివాది చేపట్టినదీ వచన కవిత్వమే. సి. విజయలక్ష్మి లాంటికవి సామాజికమైన విప్లవాన్ని కోరితే — బూతుల్లో వచనకవితలో దిగంబర కవులు, ఇస్మాయిల్, మానసిక విప్లవాన్ని కోరుతున్నారు. వీళ్ళిద్దరి మధ్యాఉంది అద్దేపల్లి రామమోహనరావు, వజీర్ రహ్మాన్, మోహన ప్రసాద్ "అతి మానసిక" విప్లవాన్నీ, చైతన్యాన్నీ కోరుతున్నారు. కుందుర్తిలోని ఆధిభౌతిక విచారాన్ని చూపించే ఖండికలూ కొన్ని 'నగరంలో వాన'లో ఉన్నాయి. 'సత్యసందర్శనం', "ఆరిపోతున్న కుంపటి" ఇందుకు ఉదాహరణలు.

రెండంతస్తుల బస్సులూ, రాత్రి సినిమాలూ, అయిదు గంటలకు మూసేసే ఆఫీసులూ, ఉన్నిసూటులూ, పరుగెత్తే బడిపిల్లవాడూ, ఆగస్టు పదిహేనున జండా వందన దృశ్యం. రిక్షాలో కూచున్న ఘోషా సుందరి, తగరపు తాళిబొట్టులా తళతళా మెరుస్తోన్న హుస్సేన్‌సాగరం చెరువూ, టపా మోసుకొస్తున్న విమానమూ, సిమెంటు గొడుగుకింద ఉన్న ట్రాఫిక్ పోలీసూ, వర్షంలో ఎక్కువ బాడుగఅడిగే రిక్షావాడూ వణుకుతున్న పాలవాడూ, (మరీ కర్రీ పాలు వానలో!). చేమంతిపూలు కొంటూన్న కొత్త గృహస్థూ, వానావల్లప్పలాడుతున్న పిల్లలూ, — ఇలా ఒక్క అరగంటలోనే "అనంత కోటిదృశ్యా"లను చూస్తుందానగరంలో కురుస్తోన్న వాన. ఇవీ మనక్కనిపించే దృశ్యాలు, అనంతకోటి దృశ్యాలు.

తన పుట్టినరోజు తనకీ మధురోహల నివ్వదు. మహాఅయితే అప్పు పుట్టిన రోజులా ఉంటుంది. కవిగాగాక మరెవరిగానో పుట్టిఉంటే తనలోని క్రౌర్యానికీ, వైరానికీ, కోపానికీ కళ్ళుకీ ఆకృతి ఇచ్చేవాడే కాని వెఖవది:

"కాని కవిత్వం ఒకటి ఉంది.
కదల నియ్యదు, మెదల నియ్యదు
మెత్తగా చేస్తుంది మనసుని." ఎంత నిజం!

"అంతా చూస్తోనే ఉన్నాను" అనే ఖండికలో కవి. రవీంద్రుడికి ఎంతో సన్నిహితుడౌతాడు. నేలమీది సంక్రాంతి వేడుకల్ని పైనెక్కడో ఉన్న ఆకాశపు వస్తువులతో ఉపమించి చెప్పడం చాల మనోహరంగ ఉంది. — "ఆకాశంలో సంక్రాంతి"లో. కవితలో fade out శిల్పాన్ని చూపిస్తుంది 'అభియోగం' అనే ఖండిక. వృత్తాన్ని వదిలేసి మానవవృత్తాన్ని స్వీకరించినందుకు కవిమీద అభియోగపత్రాలు. కాని కుందుర్తి వృత్తాన్ని వొదిలిందెక్కడా! ఇదే అసలు అభియోగం.

ఋతువుల్ని అన్నిటినీ పనిగట్టుకుని ఇంత అందంగా వర్ణించటం వచన కవితా కావ్యాలలో ఇదే ప్రథమమేమో.

ఇక చివరి నాలుగు కవితలూ కలిపి వేర్వేరుగా అచ్చువేస్తే మరొక కావ్యంగా బావుండేదేమో. అవి; 1. అజ్ఞాత శైశవం, 2. ఆరంభ యౌవనం, 3. అసమర్థకౌమారం, 4. అవసాన వార్ధక్యం. వస్తువువల్లా సంవిధానంవల్లా ఇది 'నగరంలోవాన'లో ఇమడదు. ప్రత్యేక కావ్యమే అవుతుంది. ఇకపోతే సినీవాలిలోని కథానాయకుడికీ ఇందులోని పుట్టగనే చచ్చిపోయిన బాలుడికీ ఎంత పోలికలున్నాయో విచారించదగినదే. కోటేశ్వరరావుని కుందుర్తే చంపేసాడు చివరికి, మొదట్లోనే. ఫ్రాయిడ్ సిద్ధాంతాలేమైనా (Forgetfulness దృష్ట్యా, wish fulfilment దృష్ట్యా) యిలా చంపేయటానికి కారణాలేమైనా చూపిస్తాయేమో విమర్శకులు చూడాలి. షేక్స్పియర్ పాత్ర ఫాల్స్టాఫ్ మృత్యువులా. ఈ బాలుడే (ఉరఫ్ కోటేశ్వరరావు) పెరిగితే సినీవాలిలోని నాయకుడి పోలికలకాదగ్గర పడ్డాయనో, గోపీచంద్ అసమర్థుడిలా అంతమౌతాడనేమో పాపం — హాస్పిటల్‌లోనే అడుగులో హంసపాదులా, అముద్రిత కావ్యంలా చనిపోయాడు చమత్కారంగా. ఇలాంటి మృత్యువు ఏ అభ్యుదయకవి అయినా ఆదర్శంగా చూపించగలడా?

ఏమయినా, వచన కవిత్వానికి 'నగరంలో వాన' పుష్టి, తుష్టి, సంతుష్టి తప్పక కలిగించవచ్చని ఆశించవచ్చు. చివరి నాలుగు కవుల్లోనూ కుందుర్తి కోరే కథాత్మక శైలి ఉన్నది. కాకపోతే కథ కంచికి వెళ్ళిపోతుందను కోండి. ముఖచిత్ర రచన ఆలోచనోద్దీపంగా ఉంది.

## 'నాలోని నాదాలు'

వి. సి. మౌళి

ఆధునికతకు (తెలుగు కవితలో) వచనలత అంటుకట్టినవారెవరైనా, పురాతన ఛాందస విమర్శక 'మేషకంఠీరవంబు'ల కందకుండా, తీగసాగపందిటి గుంజపట్టించిన వాడు మాత్రం 'కుందుర్తి.' రూపురేఖ తీగబలిసి, ఉద్యమాల తలబుదువ్వి, పువ్వులూ పిందెలూ తొడిగే తరుణంలో, చేవపుచ్చి తొర్రలు డొల్లచేసినా సంప్రదాయ ధారతి తరుకోటరం విడవలేని వ్రడంగిపిట్ట సమీక్షల వడగాడ్పులకు కందకుండా, ఉబుసుపోక పాఠకులుచూపే నిరాదరణ నీటియెద్దడి కెండకుండా, అందచందాలు చెరపడమేకాక, అరుచీవికారంగూడా కలిగింపగలిగిన సాహిత్యరాజకీయ తత్త్వాల చీడలూ తెగుళ్ళూ కొరకకుండా[1], కలుపు మొక్కలు ఎక్కువగా పెరగకుండా, పాదుతిరగద్రవ్వి, సున్నపునీళ్ళుచల్లి, తేమబలంతోనైనా తీగమాడకుండా చేయవలసిన అనురక్తబాధ్యతా, కలిగిన అర్హతా, రెండూ ఉన్నాయి 'కుందుర్తి'కి. ఇది వచనకవితాభిమాను లందరికీ ఆవశ్యకమైనదీ ఆసక్తికరమైనదీ అన్నవిషయంలో భేదాభిప్రాయం లేదనుకుంటాను.

ప్రస్తుతం వారు ప్రచురించిన 'నాలోని నాదాల'ను విడిగా ఒక వచన కవితా సంపుటిగా నేకాక, 'ముప్పదేండ్లు'గా, వారు, కవిగా, సహృదయలోకంతో, సమీక్షక జాలంతో సాగించిన కవితారణానికి ఇప్పటికి మిగిలిన ఆత్మపరిశీలనగానూ, తనలోకి తాను వెళ్ళినప్పటి అంతర్వాణినినాదాలుగానూ; (మనకెంతో విలువైనది) ఇందులో అడుగడుగునా పలకరించే 'నేను' కవిసమాజపరంగా వాడిన సాంకేతిక పదంగానూ,

---

(1) అలా కలిగించిన రాజకీయ తత్త్వాలను గూర్చే నేనీమాట అనడం. ప్రతిభావంతుడైన కవిచేతిలో "కవితగా 'వాటి'సత్తా అవి అనుభూతిలోకి" తెచ్చిననాడు (ఈ phrase 'సుమనోధార్మికవేల'–సృజన–6 లోది) అవి అందాన్నీ ఇవ్వగలవు, ఆరోగ్యాన్నీ ప్రసాదింపగలవు. ఈ విలువలేని అప్రతిభుని ఉబుసుపోక రచనలు 'వాసనలేని పూలూ గ్రాసములేని పండ్లూ' కాగలవు.

(మాత్రమే) సానుభూతితో స్వీకరించకపోయినట్లైతే ( స్వీకరించడం ధర్మం ) భర్తృహరి సుభాషితాలను లీలగా తలపించే మొదటి నాలుగైదు ఖండికలూ మినహా, దాదాపు మిగిలిన ఖండికలన్నింటా, కవి, తన కవితచేత స్వప్రదక్షిణం చేయించుకొని స్వాభినందనలు వల్లించుకొన్నాడనుకొనే ప్రమాదం సహేతుకమైనదే కాగలదు.

ఈ కావ్యానికి ('నేను' అనేవక్త మాటాడిన విషయాలను బట్టి) ఒక 'కవి' (ఈ కవి 'కుందుర్తి' కానక్కరలేదు) తెరవెనక పాత్ర వెనక పాత్రగా భావించి నట్లయితే, ఆయన, కవిత్వంపట్లా జీవితంపట్లా, కవి జీవనంపట్లా తనజీవితంపట్లా తన అనుభూతిలోంచి దూసుకువచ్చిన అభిప్రాయాలు "కుండ బద్దలుకొట్టినట్లుచెప్పేసి/ కోరివగతెచ్చుకొనే వారిలో" ('నేనొకణ్ణి') ఒకడుగా "సమీక్షకులు నానా చీవాట్లు పెట్టినా/రసజ్ఞుల ప్రశంసల వానలు జోరుగా కొట్టినా/దూషణ భూషణతిరస్కారాలకు దూరంగా" 'ఆకాశం వంగినా/జలధి పొంగినా నిశ్చలంగా/ఉండగల' 'ఆత్మవిశ్వాసపు కండగల' దిట్టగా సాక్షాత్కరిస్తాడు.

(పాత్ర చిత్రణే ఐతే) చాలా మెలకువగా చిత్రించిన (cunning అని నా అభిప్రాయం) ఈ కవిపాత్ర ఆడినమాటల్లో, పాడినపాటల్లో కవిత్వం ఉందనడం ఎంత న్యాయమో, చమత్కారం కనిపిస్తు దనడం ఎంత సత్యమో, ఇవిరెండూ, తనకు సంబంధించని విషయాలపై తానెంత లోతుకు పోగలడో ఎన్నిముత్యాలు తేగలడో ప్రత్యక్షంగా భావనలోచూపి, పాఠకుని అంతరంలో తన గొప్పతనం తోపింపజేయడమనే గడసరి తనంలో కంటె "ఆలోచనల వేగంలో నేనాకాశమంత పెరుగుతాను" ( ఖండిక నెం. 9 ) "అనన్య సాధ్యంగా పెరిగిన ఆదర్శాల నీలికొసలు కొనవ్రేళ్ళతో ముట్టుకుంటాను" ( ఖండిక నెం. 20 ) " మీరంతా ఆరుబయట ఎండబెట్టిన మట్టిబొమ్మలు..... జబ్బు మనుషులు ......" ( తానుపైకెగిరింది ఒక మేఘంగా వాన కురిపించడానికి అని తరువాత బహుమెలకువగా సూచిస్తాడు) అంటూ తన్నుతాను మింటి కెక్కించుకోడం, ఇతరులను గుంటలో దొక్కడం, అనే మర్మ మెరుగని వెలతనంలోనూ[2] ఎక్కువగా కనిపిస్తూఉన్నాయనడంకూడా అంతవాస్తవమే.

---

(2) "పోనుపోను పొడుగవుతున్న అర్థాల త్రాళ్ళతో ప్రాకి/అధిరోహిస్తాను నేను ఆకాశశిఖరాగ్రాలు/అనన్యసాధ్యంగా పెరిగిన ఆదర్శాల నీలికొసలు/కొనవ్రేళ్ళతో ముట్టుకుంటాను/"
"అప్పుడు మీరు/ఆరుబయట ఎండబెట్టిన మట్టిబొమ్మలు/"........

ఇలాంటి "ఆత్మస్తుతీ పరనిందా ..." బ్రాహ్మడు నిజంగా కవిజాతికి సర్వనామమే ఐన పక్షంలో ఇతను తెలుగు కవుల్లో ఎంతమందికి ప్రతీకగా నిలువగలడో. అలాకాక అతను సకల సద్గుణ సంపన్నుడైన ఒక ఆదర్శ కవిమూర్తికి ప్రతీక అయినట్లయితే అభిరుచానికి ఈ గుణాలెంత వరకు యోగ్యతలో, నిర్ణయించడం పాఠకుల ఇష్టానిష్టాలనుబట్టి తేల్చవలసిందే. అది అలావుంచి ఒక లబ్ధప్రతిష్ఠుడైన వచన కవితా ప్రవర్తకుడైన కవి చిత్రించిన కవిలోని ఈ గుణాలవల్ల మామూలు పాఠకులు కవులంతా ఇటువంటి వాళ్ళేనేమో అనుకొనే ప్రమాదం కలుగదని నమ్మొచ్చునా అని?

---

"అరోజేపథ్యంచేసి బజారుకు బయలు దేరిన/జబ్బు మనుషు"లు. వీళ్ళు 'విమర్శకు'లనే సంగతి "ఎదుటివాణ్ణి దించబోయి ఎపడికి వాడు గోతిలోపడి/గ్రుడ్లనీళ్ళు కుక్కుకుంటూ పశ్చాత్తాపంలో/తడవటం కనిపిస్తుంది నాకు" అన్న దానివల్ల కాకపోయినా, "ఒక్కొక్క చరణంలోని విసురువందపోట్ల తగిలేటట్లు/వచనగేయం రాస్తుంటేను" "గణాలులేనివి గుణాలు గావని గర్జిస్తారు మీరు" అన్నదానివల్ల స్పష్టపడుతుంది.

"తరుణంలో వానరావడం తమ కోసమే అనుకొని/కాగిలం పడవలు... / కట్టుకోవచ్చని కులికే అమాయకపు పిల్లల్లా/అసలు సంగతి తెలియదుమీకు/" అనడంలో తాను పైకెగిరింది ఒక మేఘంగా ననేవిషయం స్ఫురిస్తుంది. ఇదిచాలా cunning గావాడిన రూపకం. మట్టి బొమ్మలు వానలో కరుగుతాయి కనక, విమర్శకులకదేగతి పడుతుంది. పట్టవలసిందేకూడా ఇంతదంభ మేమని మన పడక్కుండా కవితలో కరిగిపోతాడు అనే ధ్వని ఉన్నదనవచ్చును. 'నేను లేక కరుణలేదు' అన్నమాట గుర్తుంచుకోవాలి. చాలా మెలకువగా, చతురతతో వ్రాసిన ఖండిక. స్వోత్కర్ష: ఖండిక '9'లో, భూదేవికి సందేహంవచ్చి కాలాన్ని అడిగింది:—'ప్రేమను ప్రతివాకి హృదయపు ప్రమిదల్లో వెలిగిస్తూ/భవిష్యత్తును దర్శించిన కవితారీతి ఎక్కడుంది 'అని'/ అప్పుడు కాలం చెప్పిన సమాధానం భూదేవి కవితో ( ఈ కవి ఎవరో వ్యాసం పూర్తిగా చదవండి ) చెపుతుంది "కలుసుకోమంది నిన్ను. అడిగి తెలుసుకోమంది నిన్ను." దానికి అప్పుడుకవి "అందుకుంటావో లేవో నువ్వు / ఆలోచనల వేగంలో నేను ఆకాశమంత పెరుగుతాను"

భూమి: "మరీ మంచిది ఇక్కడేఉండి/నీ చుట్టే తిరుగుతాను."

'స్వాభినందన' అనేది కుందుర్తి కవితలో కొత్తదికాదు:

అంత మాత్రం చేత ఇందులో అంతా సొంతబాకా అనుకోవడంకూడాఘోరం. సాహిత్య'రాజకీయా'లను, అమిత తేలిక మాటల్లో మరపురాకుండా చిత్రించిన మెరపు లాంటి వ్యంగ్య కవితా ఖండికలున్నాయి. నెం. 32. ఖండికలో కవిదేవుణ్ణి ఒక వరం కోరుకుంటున్నాడు విందామా?

"రోజులు గడిచినకొద్దీ జీవితం/వేపాకు నమిలినట్లుండాలి"

"నరుడు తనను నమ్మినవాణ్ణి మినహా/ మరెవరినీ కాపేయ్యకూడదు"

అలాగే, "నీవాడుకుంటున్నానని/శిశిరంలో జీవితం చెట్టు

ఆకురాల్చి అలవాటు నాకని/ బూకరించింది" (నెం. 26 ఖండిక)

"కోతిలోంచి మనిషి పుట్టాడని చెప్పాడొక మహానుభావుడు

అసలామాట నిజమోకాదోగానీ అదివ్యంగ్యమైతే పరమసత్యం"(నెం31 ఖండిక)

ఈకింది పాదాలలో ఘాటు పోటు తగిలినవారికి తెలుస్తుంది:—

"బారభ్యాసం లేని వాడినోట ఆధునిక కవిత పలకకూడదు

విని ఆనందించదగ్గది కవిత్వంలో పిసమెత్తు ఉండకూడదు"

ఇంకొక మాట. ఇంతవరకూ ఈ కావ్యంలోని 'నేను'ను, 'కుందుర్తి' నామ వాచకానికి కాకుండా 'కవి' జాతివాచకానికి, సర్వనామంగా తీసుకున్నాము. కాని, ఈ కింది మాటలు మన దృష్టిని ఆకర్షింపక మానవు:

"అడుగుజాడ గురజాడది అది భావికి బాట అనేవాడు ముందే శ్రీశ్రీ అచ్చం నేననవలసిన మాట—" (ఖండిక నెం. 28)

మరొకచోట ( నెం. 34 ఖండికలో ) 'ఎవరికి కృతిఇవ్వను ఈ కావ్యం' అని ప్రారంభించిన (శీర్షికవల్లగానీ, ఇతర మార్గానగానీ మిగిలిన ఖండికల నుండి వేరు చేయబడని) కృతిసమర్పణ భాగంలో, "జాషువా కవిని పిలుద్దా మంటే ఆయన

(a) 'యుగేయుగే' పుస్తకం తెరవగానే ఎదురయ్యే కుందుర్తి మొదటిమాటలు "ఇలా చెప్పుకుంటూ పోతే ఎంతైనా చెప్పొచ్చు నా కవిత్వం గురించి. దానినడకే వేరు. సొగసే వేరు."

(b) 'నగరంలో వాన' (16వ పేజీ) స్వాభినందనలో "అతిక్రమించి మామూలు మర్యాదల్ని/అభినందించుకుంటాను నన్ను నేను" ఇంక మనం మాట్లాడవలసింది ఏమీ లేదు.

ఎప్పుడూ పరధ్యానంగా/', "హనుమంతరావూ!" "అంటాడు నన్ను'' అని వుంది. అన్నిటికంటేమించి, 'మహతి, అన్న ఉపోద్ఘాతంలోనే, "నా మనస్సులోని రకరకాల వేదనలలో నాలోనినాదాలు! ఒక శతాంశాము" అని ఉంది. ఈమాటల్లోని, "నేను, హనుమంతరావు, నా."అన్న వాటిని పోల్చుకోవడం, కోకపోవడమనేది పాఠకుల నిజాయితీనిబట్టి జరగవలసింది. పైవాక్యాలలోని 'శతాంశము' సంగతి అలా ఉండనిచ్చి ఏమయినా,

"మనిషి మనస్సు వేయి రంగుల విశ్వరూపచిత్రం. ఈ అన్ని రంగులనూ బైటపెడితే నాగరికలోకం చూసి సహించలేదు. అందులో కొన్ని మాత్రమే చూడడానికి యోగ్యంగా ఉంటాయి. కవిమనస్సులోని ఊహాలు అనేక పరిమితులకు లోబడి బైటకి రావాలి" అని కుందుర్తి, స్వయంగా ఈ పుస్తక పీఠికలో వ్రాసిన మాటలు పాఠకులేకాదు, కవులకు కూడా (కూడా ఏమిటి, ముఖ్యంగా) మరచిపోరానివి.

ఏది ఏమైనా, ఇందులోని 'వక్త' కుందుర్తి సృష్టించిన పాత్రఐనా, స్వయంగా కుందుర్తి ఐనా, వారు నీతివాక్యాలు చెప్పినా[3], విమర్శకులనూ, ప్రచురణ కర్తలనూ దెప్పినా[4], మీరేమన్నాసరే 'నాదారి నాది' అని 'తనమార్గ మెరుంగజెప్పినా'[5], గుర్తుకు

---

(3) ఖండిక రెండు "అవివేకానికి మందులేదు అనుభవించడం తప్ప
తెలివి ఒక్కటే నది దాటించే తెప్ప"
ఖండిక నాలుగు "గుండెలోకి తలుపులు తెరిచి కొలువు నిదేశభక్తి
వీరుడై విజృంభించే నూత్నమానవుడి విజ్ఞానశక్తి"

(4) 'న్యాయంగా తనవంతు తీసికొని మిగిలింది వదలటానికి / ప్రచురణ కర్తకు మనసొప్పదు'

(5) 'మనిషి మీద పాముపుట్ట పెరగనీ/మహాకావ్య నిర్మాణ సూచిగా'
బ్రతుకుమీద నల్లేరు మొలవనీ/భావికాల సౌలభ్య కారిగా/నాదారినాది.
'ప్రయోజనం తండ్రి, పరమ సౌందర్యంతల్లిగా/పలికే ప్రతివాక్కు రసానంద కల్పవల్లిగా నాదారినాది.'
"కాలం కంఠంలో గ్రుచ్చినా/సమాధి చెక్కిస్తిక ప్రజ్ఞలు/కొందరున్నారు లోకంలో అందులో నేనొకణ్ని." ఇలాగే (29 ఖండిక చూడవచ్చు)

దెచ్చుకొని సోదర కవుల వీపుతట్టినా[6], ఒక్కొక్క చరణంలోని 'విసురు' ఆయన అన్నట్లు వందచోట్ల తగలకున్నా[7], 'పలికే ప్రతివాక్కు రసానంద కల్పవల్లిగా'కున్నా అతిసామాన్యమైన భావాలనే సరళమైన 'రీతి'లో చాలమంది ఆధునికులకు లేనంతటి స్పష్టతతో, చమత్కృతితో మెరిపించిన సందర్భాలున్నాయనడం[8] 'కుందుర్తి' కవితకు ఈనాడివ్వగలిగిన కొత్త బిరుదేమీ కాదు. కాని ఒక మహానుభూతిని గుండెల్లోకి తొలుచుకుపోయేట్టు చేయగలిగితేతప్ప చమత్కారం ఒక్కటే కవిత్వానికి చరమావధి కాదు. కవితలో చమత్కారం అంగమేకాని 'అంగి'కాదు.

---

(6) 'ఈనాటి అనుభవాల ఇనుప గుగ్గిళ్ళ సేవించి/నిర్మిద్దాం విశాల భవిష్యత్తు'
"అద్దదీమాట–ఎవరేమన్నాసరే పద/ఈ పూట రాసే పాటలో రేపటి బొమ్మ చెక్కుకుంటూ/వెనుజూడమి ఒకటే మనకేనాటికి చెడని సంపద/అరనిముషం జాగైతే ఆనేరం నీది/అవలితీరం చేరకపోతే ఆభారంనాది."

(7) చూడు Note (2).

(8) ఈ దృష్ట్యా మొట్టమొదట చెప్పుకోదగింది చిట్టచివరిఖండిక. కృతి ఎవరికివ్వాలో తోచనట్టు ఒక్కొక్కకవిని. తీసికొని ఆయన కివ్వకపోవడానికిగల కారణాలు చెప్పుకుంటూ ఎవరికీ ఇవ్వనని చివరకు చెప్పడంలోని నేర్పు తలపూపిస్తుంది. అందరు కవులకూ తన కావ్యం కృతిఇవ్వకపోడానికి కారణాలు చెప్పుకుంటూ తిలక్‌దాకావచ్చి 'ఇవ్వగలిగిన సర్వసమర్థుడతనికి తీసుకునేఖర్మ ఎందుకుపట్టాలి' అనడంలోనూ,

"ఈకృతి ఇలా వెలుగుచూడడానికి/పదిమంది మిత్రులు పట్టుపట్టారు గానీ చెరిసమంగావారికి పుటలు పంచానంటే/శేషం మిగుల్తున్నది ( ఇందులో 34 ఖండికలున్నాయి) వారిలో వారికి యీ భాగ్యానికి వైరాలు పెంచడంబాగుండదు."
అన్నప్పుడూ, 'కుందుర్తి' కవితలో చాలా 'ఖులాసా' కనిపిస్తుంది. కాని శ్రీశ్రీని అభ్యుదయపు 'నిషా'లో ప్రవేశపెట్టడమే కాకుండా, ప్రతికవికి ఏదో వంకపెట్టి ఒక్కతిలక్‌ను మాత్రమే అకళంకమూర్తిగా చూపడం చమత్కారం కోసమైనా న్యాయమైన చిత్రణాకాదు, 'కుందుర్తి' సమదృష్టికి నిదర్శనమూకాదు.
దీనితర్వాత చెప్పుకోదగ్గది 33 ఖండిక. భగవంతుడు పంపిన సృష్టికావ్యాన్ని తిరగేసి కవిచేసిన విమర్శ చదివి చూడవలసింది. ఆ తర్వాత 32 ఖండిక. 2వ నోట్‌లో చెప్పిన ఖండికలో చాతుర్యం ఎక్కువ. భావసంగతి ఎలావున్నా చదివిచూడవలసినదది.

# మరొక్క స్నేహ హస్తం

(సంవేదన త్రైమాసిక. తొలిసంచిక: ఏప్రిల్ 1968. సంపాదకుడు: రాచమల్లు రామచంద్రారెడ్డి. విడిప్రతి: రు. **1-25**. సాలుచందా రు. **5-00** ప్రతులకు: మేనేజర్, సంవేదన 19/28 మద్రాస్ రోడ్, కడప, నిర్వహణ: యుగసాహితి)

కొత్త సంవత్సరంలో మరొక్క సోదర సాహిత్య పత్రిక ఉదయించింది, 'సంవేదన' కు 'సృజన' ఆర్ద్రంగా స్వాగతంపల్కుతున్నది,

ఇందులో ఆరు కవితలు, ఒకే సన్నివేశంపై రాసిన నాలుగు కథలు, ఓ నవలా పరిచయం, రెండు సమీక్షలు, గోర్కీపై వ్యాసం, జెకొస్లొవాక్ రచయితల సంఘ చతుర్థమహాసభ చేసిన తీర్మానంలోని కొన్నిభాగాలు, ఓ గేయకార్టూనూ ఉన్నాయి. ముందులక్ష్యనిర్వచనముంది. అందులో వ్యాపారస్థాయికిదిగజారిన నేటి సినిమాల మీద పత్రికలమీద ఘాటైనవిసుర్లున్నాయి. 'పుట్టగొడుగుల్లా వీధివీధినా పత్రికలెన్నిఉన్నా తెలుగుజాతికిగల ఉత్తమ సాహిత్యాభిరుచిని యేవీ తీర్చడంలేదు. ఉత్తమ సంస్కార సుందరమైన ఉత్తమ జీవిత వ్యవస్థకు అభిముఖంగా తెలుగుజాతిని యేదినడిపించడం లేదు. ఈలోపాన్ని తీర్చడానికే మా 'సంవేదన' అవతరిస్తున్నది' అనిచెప్పుకున్నారు, అందులో.

ఆతరువాత మొట్టమొదట వినిపించేది వి సి.మౌళి 'కంఠశోష' కవిత. "పదపోదాం మనకెందుకు పదవయ్యా మనిషీ! వింటారా ఛస్తారా! కంఠశోషదేనికి ?" అంటూ ప్రారంభమవుతుంది. రెండోకవిత శ్రీశ్రీ,సదసత్సంశయం. "విననాచెప్పిందే ఒక వేదంగా భావించే యస్సన్నల, కస్సన్నల. తుస్సన్నల తెలుగునాడు. శ్రీశ్రీ చెప్పేదానిని శిరసావహించువేళరావడానికింకా ఒక అమడ దూరంఉన్నది" అంటాడు.

మూడవది కె.వి.రమణారెడ్డి 'ఆత్మచిత్రం' "అయితే తారలను తలదాల్చే శిఖరమైనా కావాలి, కాకుంటే అతినికృష్టమైన అగాధమైనా మేలు. ఎగుడోదిగుడో ఏదీలేని పీఠభూమిగా స్తుతికో నిందకో యోగ్యతలేక పడివుండడమంటే మహాచెడ్డరోత' ఇలామొదలై, poem అంతా మొదటచెప్పిన భావానికి వివరణగా రకరకాలపోలికలు కూర్చిచెప్పడం. దీనికి 'ఆత్మచిత్రం' అన్నశీర్షిక ఎలానప్పుతుందోకూడా విచార్యమే. కొంతభాగం అసలు అర్థంకాదు. ఉదాహరణకి 'తనలోతాను దూరడమంటే లోకాన్ని ఏమారుస్తూ తనను తానే కొరికితినే పిశాచపులాస్యం' అంటే ఏమిటి? ఇక నాలుగో కవిత వరవరరావు 'రేపటి ఉగాది'. "సమ్మెచేసిన మిల్లు కార్మికులవలె ఈరాత్రి చెట్లు వీచడం లేదు". "ఆకలీ అన్యాయం. అవ్యవస్థ ఏదీ కదిలించలేని అప్రతిఘులైన మనుషులవలె ఇవ్వాళ స్తబ్ధమైనచెట్లు". ఈరెండుభావాలూ ఒకే poemలో రెండు భిన్న స్థితులను చెపుతవి. "వేదాలు ఎప్పుడు పుట్టాయోతెలియనట్లే ఏపక్క ఎప్పుడు ఎక్కడ అరవడం ఆరంభించిందోగాని ఒకే అపశ్రుతిలో ఈచీకటి వాయిద్యంపై భీభత్సబృందగానం వినొస్తున్నది''పాపపుణ్యాల సరిహద్దుల్ని మలుపుతున్న సైన్యువలె అమావాస్యనుహాస్యం చేస్తున్న విద్యుత్కాంతి'. ఈ poemలో ఆద్యంతమూ చక్కని పొందికఉంది. atmosphere ఉంది. 'నిరర్థకంగా చావడంకోసం ఈఉగాది శిశువుపుడుతుందనుకోను నేను' అన్నఆశాభావంఉంది. అయిదవది అద్దేపల్లి రామమోహనరావు 'పురోగామి'. 'నా వెన్నెముక మీద ప్రజారథచక్రాలరాపిడి' అంటూసాగుతుంది. అయితే 'నడచిపోతున్నాను నాభావాలు పట్టని ఈ యుగసంధులో— తెరుస్తున్నాను నాగుండెలో యీ ప్రపంచపుతలుపు' అన్నపాదాలు కదరలేదు. ఇది మినహా మిగతా poem అంతా "వెలివేశాను", "మసిచేశాను", "తగులబెట్టాను" అంటూ "సమస్తాభ్యుదయకవుల సమిష్టిస్పందన" వినిపిస్తుంది. చివరిది వేగుంట మోహనప్రసాద్ "అన్వేషణ" అమాయకత్వంతోకూడిన ఓ విలక్షణమైన వాడుకభాష (idiolect) ను ప్రయోగిస్తాడు వేగుంట. భావాలుకూడా మందారాల్లా సున్నితంగా ఉంటాయి. అతిచక్కని పదచిత్రాలుంటాయి. "రాత్రి ఎలాగో వెళ్ళమారితే గాలిలో నిండిన నిద్రని ఎద్దు గంటల్తో తడుతూ లేపుతూ వేకువ కాడిబుజానవేసుకొని కిర్రూకిర్రూ చక్రాల్తో ఉట్టి బళ్ళతో వెళ్ళిపోతాయ్". రైలు ముంగాళ్ళని చాచి ఆవిరొమ్ముల్తుంది. దుమ్మురేపుకుంటూ బస్సు నిల్చిపోతుంది. పైనుంచి దిగిన విమానం మైలు దూరం నేల మీద పాకుతుంది. గుర్రం ముఖంపైకెత్తి కాళ్ళు నేలమీదరాల్చుతుంది. వడవడకగుడ్డిఅలలాఒడ్డునితడుముతుంది", "మంచు తనకొంగంతా చెట్ల ముఖాల మీద కప్పింది. ఊపిరాడక కొమ్మలు రెమ్మలూ తోసేస్తున్నాయి" వంటివి. అయితే ఈ కవి రచనల్లో నేటికవుల్ని వేధిస్తున్న సాంఘిక

సమస్యలేవీ తటస్థపడవు. రహస్యమర్మవాదపు కిరణాలు సోకిన ఆత్మాశ్రయ కవిత వేగుంటది. గజ్జల మల్లారెడ్డి గేయకార్టూన్ 'కవితావిపణి' ఆద్యంతమూ చమత్కారంతో చక్కగాసాగుతుంది. అయితే విమర్శలను ప్రస్తావిస్తూ— 'కవితాసతి సరదాపడి గడసానై నడివీధిన ఆశువృద్ధికోసం ఆడిన దొమ్మరి ఆటలు' అనడం కాస్త హద్దు మీరడమే.

మాక్సింగోర్కీ శతజయంతి సందర్భాన్ని పురస్కరించుకొని ఆయన జీవిత సాహిత్యాలను సమీక్షిస్తూ 'మాక్సింగోర్కీ—జీవితమూ కృషి' అన్నవ్యాసం సముచితంగావుంది. జెకొస్లావాక్ రచయితల సంఘ చతుర్థ మహాసభ చేసిన తీర్మానంలోని భాగాలు కొన్నివేశారు, 'సంస్కృతి–స్వేచ్ఛ' అని. దొరికితే మూలం చదువుకోవటంమేలు.

మహీధర రామమోహనరావుగారి 'కొల్లాయిగట్టితేనేమి'ని ఉత్తమ చారిత్రక నవలగా పరిచయంచేస్తూ రాచమల్లు రామచంద్రారెడ్డి రాసిన వ్యాసం అత్యంత ప్రతిభావంతంగాఉంది. సాంఘిక, చారిత్రక నవలల మధ్యనుండే భేదం, చారిత్రక నవలా లక్షణాలు, జీవితానికీ, జీవితాన్ని ప్రతిఫలించే సాహిత్యానికిగల సంబంధం, వ్యక్తుల్లో స్థూలదృష్టికందని ద్వంద్వస్వభావం ఎంతోచక్కగా విపులీకరిస్తారు వ్యాసకర్త. దాదాపు పాతిక పేజీలు సాగిన ఈ సమీక్ష నవలలోని విశేషాంశాలనన్నింటిని సహేతుకంగావిమర్శిస్తుంది.

ఇక కాళోజి 'జీవనగీత'మీదా, సృజన–6 మీదా సమీక్షలున్నాయి. రెండూ రా. రా సమీక్షించారు. 'జీవనగీత' సమీక్ష ('కాళోజీగీత' అన్నదిశీర్షిక) కాళోజీ అభిమానులకు కొంత 'షాక్' అయినా సహేతుకంగానూ, సోపపత్తికంగానూవుంది. అయితేచివర్న సమీక్ష సమీక్షాగ్రంథం పరిధుల్నిదాటి, కవివ్యక్తిత్వంమీదా, ఏతత్కవి పూర్వ కవిత్వంమీదా ప్రసరించటం పత్రికకు వన్నెతెచ్చేదిగాలేదు.

ఇక కథలు. ఒకే సన్నివేశం అధారంచేసుకొని నలుగురు కథకులు రాసిన కథలు నాలుగూ వరుసగావేశారు. అయితే అవి నలుగురూ విడివిడిగా యెవరి పాటికి వాళ్ళు రాసినవికావు. మొదటికథ చదివి రెండపరచయితా, మొదటిరెండూ చదివి మూడవ రచయితా, ఆమూడూచదివి నాల్గవరచయితా రాసినవి. వీటివెనుక ఓచరిత్రవుంది. మొదటికథను ఓ వారపత్రికకు పంపగా అది తిరిగివచ్చింది. కథాశిల్పం గురించి

యాదృచ్ఛికంగావచ్చిన చర్చలఫలితంగా తక్కిన కథలు పుట్టాయి. ఇవి ఇలా ప్రచురించడం ఓ కొత్త ప్రయోగంగా వుంటుందని ఆశించారు సంపాదకులు. ఒక నిర్ణీత సన్నివేశంపైన కథ రాయాలన్నప్పుడు ఆకథకు లక్ష్యంయేమిటి? ఆ లక్ష్యం సాధించ డానికి తగిన శిల్పంఏది? అన్నసమస్యలుత్పన్నంకాకమానవు.

ఒక యువకుడు ఒక హోటల్ గదిలోదిగి అందులో ఎవరోవదలిపెట్టిన మల్లెపూలు చూస్తాడు. క్రితంరాత్రి ఎవరోస్త్రీ ఆగదిలో ఉండిన ఓ పెద్దమనిషితో గడిపిందనీ, ఆ పెద్దమనిషి ఆమె తమ్మునికి ఉద్యోగం ఇస్తానని మాటయిచ్చి మాట నిలబెట్టుకోకుండానే వెళ్ళిపోయాడని తెలుసుకుంటాడు.

స్థూలంగా ఇదీకథ. మొదటికథలో (సోదుం జయరాం) ఆయువకుడు ఓకథకుడు. ఆ అనుభవంలోంచి ఓ కథావస్తువు దొరుకుతుంది. ఉన్నంతలో ఈ కథే ఓమాదిరిగా వుంది. రెండోకథలో (రాచమల్లు రామచంద్రారెడ్డి) ఆ యువకుడు ఓ వెర్రిప్రేమికుడు. రైలు ప్రయాణంలో పరిచయమైన ఓ అమ్మాయిమీద ప్రేమావేశంతో ఓపగటికల అల్లు కుంటాడు. కథలో సగంపైగా ఆక్రమించిన ఈ పగటికల ప్రయోజనంయేమిటో? ఇక మూడవకథలో (ఆర్వియార్) మల్లెపూలమీదా, రైల్వేలమీదా, సిగరెట్లమీదా, స్కూల్లోచదివే పిల్లలయాచనమీదా ఇంచక్కని స్వగతాలున్నాయి. నాలుగోకథ (టి. సాంబశివారెడ్డి) పూర్తిగా పట్టాలు తప్పింది. కథపేరుకూడామారిపోయింది. 'వాడినమల్లెలు' 'నవ్వినమల్లెలు' అయినాయి. 'ఉద్యోగం' 'సినిమాఛాన్సు' అయింది. ఇందులో మల్లెపూలమీద రసికత్వాన్ని ఒలికించే కవిత్వంకూడావుంది. ఈచివరిరెండు కథల్లోకూడా ప్రేయసి ప్రస్తావనవుంది.

ఇందులో ఒకరి కంటె ఒకరు బాగారాయాలనే ఉద్దేశం ఉన్నట్లు సంపాదకులు పేర్కొన్నారు. అది ఎక్కడాఉన్నట్టు అస్మదాదులకు తోచడంలేదు. మరి ఈమాత్రం ప్రయోగశీలత్వానికే తెలుగు పత్రికలన్నింటిమీద దుమ్మెత్తిపోయడం ఎందుకు? పాఠకుల్లో విశేషంగా పఠనాభిలాషనుపెంచి, రచయితల్లో రచయిత్రుల్లో రచనాభిలాషను పెంపొందిస్తున్న నేటి వారపత్రికలమీద, కేవలం ఓకథను తిప్పివంపారనే ఆవేదనతో ఆ కథను మంచిచెడ్డలైనా గుర్తించకుండా 'వార వనితలకు తమపోషకుల పట్లగల శ్రద్ధవంటిదే మన వారపత్రికలకుకూడా తమ పోషకులపట్లగలశ్రద్ధ' అనగలగటం ఈ పత్రికకేచెల్లు. ఉత్తమసాహిత్యాన్ని అందజేస్తామని, ఉత్తమసాహిత్యాన్నే

ఇవ్వగలమని లక్ష్య నిర్వచనం చేసుకున్నావారు ఇలాంటి తలాతోకలేని ప్రయోగాలను పాఠకుల నెత్తిన రుద్దటం ఎందుకు?

దుడుకుతనం చాలించి, balanced గా ఉంచే పత్రిక నాలుగు కాలాలు మన గలదు. 'సంవేదన', మలిసంచికల్లో ఏతద్విషయాన్ని దృష్టిలో వుంచుకుని, ఇతోధికంగా సాహిత్యసేవచేయగలదని గాఢంగా నమ్ముతున్నాను.

---

## జననం ముదావహం....

---

(కళాకేళి తొలిసంచిక సాహిత్యమాస పత్రిక. ఎడిటర్: సోమసుందర్ ఏప్రిల్; 1968, కీలక–చైత్రం. వెల **50** పైసలు.)

వస్తుంది, వస్తుంది అనుకున్న సోమసుందర్ పత్రిక వచ్చేసింది. 'యువర్ అటెన్షన్ ప్లీజ్' అంటూ ద్వితీయ సంచికకూడా వస్తుందని ఆశపెట్టారు.

ప్రథమ సంచిక కనక ఫరవాలేదు అని సర్దుకోవచ్చు. అది ఆనవాయితీగా జరిగేపని. మరీ ద్వితీయ సంచిక వస్తుందన్న నమ్మకం సన్నగిల్లినప్పుడు తప్పకుండా జరిగేపని. కాని సంపాదకుడు సోమసుందర్ పాతికేళ్ళ సాహితీ వ్యాసంగంతో తల పండినవాడు. శృంగారాన్ని, విప్లవ అంగారాన్నీకూడా చిమ్మినవాడు. వీటన్నిటికితోడు 'గమనిక'లో ఈ పత్రికా నిర్వాహకులుగా మాకు నిర్దిష్టమైన అభిప్రాయాలున్నై అనికూడా చెప్పుకున్నారు. అయినా ఈ ముగ్గుబుట్టను మనచేతి కందించారు. కారణం ఏంలేదు — తీర్థానికి తీర్థం. ప్రసాదానికి ప్రసాదంలా సాగిన 'నిర్దిష్టమైన అభిప్రాయాలా.'

మొత్తం ఎనిమిది వచన కవితలున్నాయి. మొదటిది మిరియాల రామకృష్ణ 'హాస్పిటల్,' చక్కగావుంది. ఎటొచ్చీ సంస్కృతపదాలు, సమాసాలే ఈయన కవితకు చుట్టుకున్నఉరి. రెండవది వరవరరావు 'మోక్షమ్, చాలామంది యువకవుల రచనల్లా ఎవరూతినలేని పులగంకాదు వీరిరచనలు. స్పష్టత చెడకుండా నడుస్తుంది

రచన. Social consciousness వీరి ఇటీవల రచనలన్నింటిలోని జీవగుణం. అయితే 'ప్రతి నెత్తురుచుక్కా చెమటచేసి, ప్రతి చెమటచుక్కా బుక్కచేసి, నీకష్టం నీ హక్కుగా తినాల్సిన నీకెందుకు దొంగనాచి పూజలు గీజలూ, అన్నప్పుడు భావం కోసం కాకుండా రచనలో ప్రాసకోసం ఇంకా నేటి వచనకవి ఎందుకు పాట్లుపడు తున్నాడా అని విచారం వేయకమానదు. మూడవ కవిత మహమ్మదు ఇస్మాయిల్ 'పంజ నారింజ' తెలుగు 'ఫల'హారం. మరీ యువతరంలో వేగుంట ఒక్కడే పట్టు కున్న ఆ పదాల సొంపును ఈయన నారింజ తొనల్లా పంచిపెట్టారిందులో. వే. నరసింహారెడ్డి 'నడచివచ్చిన సముద్రం' గంభీరంగా సాగింది. సంస్కృత పదాలమీదా, శ్లేషమీదా మోజు ఇంకా వదల్లేదీ కవికి. శీలా వీర్రాజు చిత్రకారుడు, కథకుడు, యీ మధ్యకవిగా కూడా (కథాకావ్య రచయిత) పరిచయమయ్యాడు. వారి 'అద్దెగది' ఇంకావుంది. సీరియల్ కథలూ, సీరియల్ నవలలూ ఆదరిస్తున్న నేటి ఆంధ్ర పాఠకలోకాన్ని దృష్టిలో వుంచుకుని యీ సీరియల్ ప్రచురించి వుండవచ్చు. యీ 'ఉపఖండం' (భారత దేశం) 'బురదగుంట' అన్న ఊహతో ప్రారంభమయింది నిఖిలేశ్వర్ కవిత. 'యీ ఇంట్లో సగటు మానవుని వొంల్లో—రోజూ ఉడుకుతున్న లావా వెసువియస్ లోపల ఎగచిమ్ముతోంది సెగలు' అన్న భ్రమతో ముగిసింది. 'బురద' ఉండకూడదు—నిజమే! ఆమాటకొస్తే 'పందులూ' ఉండకూడదు కాని ఉన్నాయి. బహుశా ఉంటాయి. అటువంటప్పుడు దిక్కులు చూపిస్తూ ఎంతకాలం? గమ్యంచేరే మార్గం ఆలోచించాలి—ముందుకు నడిపించాలి. పేర్వారం జగన్నాథం 'సెట్ ఆఫ్ సిలబస్' నవ్వుకోవడానికి బావుంది. వేగుంట మోహన ప్రసాద్ 'వీభూతి' చదువుకోవడం ఓ అనుభవం. 'ఏకాక్షిశవం, పేపర్ వెయిట్ లాకన్ను' అద్భుతమైన పదచిత్రం.

ఇక 'బీటల్స్ భారతదేశం వచ్చారని వార్త' అంటూ ఆరంభమయిన 'ఆలోచనా స్రవంతి' వాసమూర్తి వ్యాసంతీరు 'అధర్వణ వేదంలో అన్నీవున్నాయిష!' పద్ధతి. ఇంకోవ్యాసం ఆర్. యమ్. చల్లా 'రైనర్ మారియారిల్కే' గురించి రాసింది. యీ వ్యాసంలో ప్రత్యేకత వ్యాసరచయిత తానెందుకు ఆ కవినే అభిమాన కవిగా ఎంచుకున్నాడోకూడ చెప్పడం ఇంకా. చాలా 'పోలికలు' ఉన్నాయి. తనుకూడా (చిన్న) కవి. తను ఆకవి మరణించిన సంవత్సరమే జన్మించాడు ఇత్యాది. సంపాదకులు ఈయనకు ఆదేశించింది 'ఆధునిక యూరోపియను కవితపై రిల్కేయొక్క ప్రభావం' అన్న అంశం. అయితే వీరు ఒకవిధంగా చెప్పవలసివస్తే రిల్కేకవిత తత్పూర్వమైన

కవితవల్ల ఉత్తేజితమవలేదు. తన తరువాతవారి కవితను ఉత్తేజపరచనూలేదు అని భావించారు!!! ఫలితమే ఈ వ్యాసం. వ్యాసరచయిత 'రిల్కే'కు Existentialismతో చైతన్యవంతమైన సంబంధం లేదు'అని వ్రాస్తూనే తాను ఒక స్విస్ విశ్వవిద్యాలయంలో వేదాంతాన్ని అభ్యసిస్తున్నప్పుడు తమ అధ్యాపకుడు రిల్కేయే కాకుండా, డోస్టో ఏవ్స్కీ (ఎవరో? సంపాదకులుగానీ, వ్యాసరచయితగానీ పాఠకులకు తెలిసే వుంటుంది లెమ్మనికాబోలు — చెప్పలేదు. రిల్కే విషయంలో అలా అనుకోలేదు ఎందుకోమరి?) కూడా Existentialism యొక్క పితామహులలో లెక్కపెట్ట వలసినవాడే అని సెలవిచ్చాడు అంటూ ఏకరువు పెడతారు. ఇదంతాచూస్తే Rilke తన Duino Elegies లో who, if I cried, would hear me among the angelic orders?' అన్నది జ్ఞాపకం వస్తుంది. రిల్కేమీద 'రాముడు' వ్రాసిన వ్యాసంలాగుంది.

కుందుర్తి 'ఆధునిక కవిత్వంలో ఆంగ్లభాషా పదాడంబరం'లో ఆయన ఆవేదనంతా వ్యక్తమయింది.

సృజన–6 సమీక్షలో సృజన అచ్చు ఆర్టిస్టిక్‌గా లేదని ఓ విసురు విసిరారు సమీక్షకులు 'ఆనందవర్ధన.' అంటే ఏమిటో–మాత్రం చెప్పలేదు. ఈ 'కళాకేళి'లో 'లేఖాళి'అని ఓ శీర్షికకాబోలువుంది. దానిని నిర్వహిస్తున్నది సంపాదకుల 'మక్కువ నోచుకున్న' అనుముల కృష్ణమూర్తిగారు.

'కళాకేళి ధర్మసంగ్రామకేళి' అని ఆఖర్నో సంపాదకీయంకూడా వుంది. అందులోతామీ 'చారిత్రక బాధ్యత' (?)ను ఎందుకు స్వీకరించారో వివరించేప్రయత్నం చేశారు. మాడభూషిగారు ఈ సంచికలోనే ఓ సమీక్షలో అన్నట్టు 'ఆదినుంచీ ప్రతివారూ ఏదో మహత్కార్యం నిమిత్తం తాపత్రయపడుతున్నా మనుకోవడం ఒక సోత్కర్ష. దేవుడిదగ్గర్నుంచీ ప్రతివాళ్ళూ లోకం మరమ్మత్తుకోసం "సంభవామి యుగేయుగే" మనస్తత్వం పెంచుకున్నవాళ్ళే.

— పురహర

సాహిత్య లేఖలు;

"........చాలా బావుంది పత్రిక. చలాన్ని పత్రికకి వినియోగించక చలానికి పత్రికని వినియోగించారు. ఎంతో సంతోషంగావుంది."

—చలం

"........చలం సంచిక.. చదివాను. చలం రచనలు చదవటం మేలనిపించింది. చలం విమర్శకులు మనస్సుకు జబ్బు తెప్పించారు ......."

—కొడవటిగంటి కుటుంబరావు

